Photo by S. H. Kotak



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఇంటా బయటా జంటకవుల వలె

పంపినవారు :
కె. బసివిరెడ్డి, మార్టేరు.



# రాగిణి

ఇలా చెప్పుచున్నది. "నేను ఎల్లప్పుడూ లక్స్ టాయ్‌లెట్ సబ్బును వాడుచున్నాను — అది ఎంతో తెల్లనిది, ఎంతో శుద్ధమైనది, సౌమ్యమైనది!"

ఉల్లాసవతియగు రాగిణి ప్రవీణ నర్తకి, సొగసైన తార. ఆమె ప్రకాశమాన చర్మ సౌందర్యము అనేక మంది వనితలకు అసూయాకరమైనట్టిది — "నేను ఎల్లప్పుడూ శుద్ధమైన, తెల్లని పరిమళమగు లక్స్ టాయ్‌లెట్ సబ్బును వాడుచున్నాను" అని ఆమె చెప్పుచున్నది.

రాగిణివలె చేయుడు — శుద్ధమైన, తెల్లని లక్స్ టాయ్‌లెట్ సబ్బును వాడుడు: శరీరమంతటి సౌందర్యము కొరకు, పొదుపైన పెద్దసైజును కొనుడు!

## లక్స్ టాయ్‌లెట్ సబ్బు






సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

LTS. 545-50 TL

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
ఫోటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.





ధైర్య శాలి
# రాము

డంబాల
# రంగా




















HVM. 306A-19 TL


...అయ్యో ఎందుకొచ్చానా అనిపస్తొ యించకముందే వాళ్లు సరిగ్గా యమలోకంలో చేరిపోతారు.


హా! హా! హా!- ఇదేమిటి? నాకత్తి దాహాన్ని తీర్చే వాళ్లె వరూలేరా?


ఇలా చూడు, రంగా! నీ గుఱ్ఱంకాలు విరిగి పోతోంది;


నీ అపర వీరత్వం ఇప్పుడేమైంది?


అయ్యో! నాఎముక లన్నీ టెనీవిరుగ గొట్టు కున్నాను!
నీవు అసలైన ధైర్య శాలివి కావలెనను కొంటే, ప్రతిరోజూ పాలుత్రాగుచూ డాల్డాతో వండబడిన ఆహా రంభుజించుచూ అధిక బలి ష్ఠుడవుకావాలి.




डालडा

# మీకు హితులైన వారికి
# దీపావళికి యిచ్చుటకు

ఒక 'కోడక్' కెమేరా
హృదయము పులకరింపచేసే కానుక.
అంతేకాక దానిని ఏళ్లతరబడి సరదాగా
వాడుకొనవచ్చును! అనేక రకముల చక్కని 'కోడక్'
కెమేరాలు దొరకుతున్నాయి. మీరు యివ్వదలచుకొన్న
వారికి సరిగా తగిన ఒక కెమేరా సులభముగా ఎంచుకొనవచ్చును!
సొగసైన మరియు వాడుటకు సులభమైన ఒక 'బ్రౌనీ' కెమేరా యిస్తే ఏ పిల్లలైనా
ఎగిరి గంతువేస్తూ తీసుకొంటారు. ఈ కెమేరాలు రు. 18/75 తక్కువ ధర
మొదలుకొని యింకా ఎక్కువ ధరలలో దొరకుతున్నాయి! పెద్దవారికి యిచ్చుటకు
అందమైన ఫోల్డింగ్ సిక్స్-20 కోడక్ 'జూనియర్' II కెమేరా ఉంది. దీనికి *f*/6.3 లెన్సు.
1/50 సెకెండు వరకు షట్టర్ వేగములు కలవు. ధర రు. 122/00 మాత్రమే. ఇంటివద్ద
చూపగల 8 మి.మీ. చలన చిత్రములలోని సంతోషమును పొందుటకు 'బ్రౌనీ' మూవీ
కెమేరా టర్రెట్ *f*/1.9కు సాటిలేదు! దీనికి స్టాండర్డ్, వైడ్-ఏంగిల్ మరియు
టెలిఫొటో వైన మూడు లెన్సులు కలవు. దీని ధర
అనుకోనంత తక్కువ — రు. 660/00. అమ్మకమునకున్న
అనేక రకముల 'కోడక్' కెమేరాలలో
యివి కొన్ని మాత్రమే. మీ కోడక్
డీలరువద్ద యింకా ఎన్నో రకము
లవి దొరకుతున్నాయి.

ధరలలో
అమ్మకపు పన్ను
చేర్చబడలేదు

K. 4474

## చక్కని, స్పష్టమైన చిత్రములు కావాలంటే

# అద్భుతమైన కానుక...
## ఒక కోడక్ కెమేరా







కోడక్ లిమిటెడ్
(ఇంగ్లండులో సంస్థాపితము: కంపెనీ
సభ్యుల బాధ్యత పరిమితము)
బొంబాయి - కలకత్తా - ఢిల్లీ - మద్రాసు

**'కోడక్' ఫిల్మునే వాడండి!**



ఫోటో: 33 గెవాపాన్‌పై పి.సి.పటేల్ తీసినది

# చక్కటి పంటను గురించి
# చెబుతున్నది అతని చిరునవ్వు







ఆ రైతుకు భూసారం, పండే పంట తెలిసి, ముందును గురించి నవ్వుతున్నాడు. కొత్త సాగు విధానంలో వున్న పనిసులువు, పంటపసందు అతనికి తెలుసు. ఆ బొమ్మ మనసుకి హాయి నిచ్చే కథను చెబుతున్నది. గెవార్ట్ ఫిలిముతో తీసే బొమ్మలు ఇంకా ఎంత ఆనందమిస్తవో. ఆ అద్భుత మధురస్మృతుల్ని మీరు తలుస్తారు. ఇన్‌డోర్ ఔట్‌డోర్ స్నాప్‌లకు ఎన్నికైనది గెవాపాన్ 33 లేక 36-" తప్పు వెలుగునైనా సరిదిద్దగల ఫిలిము. దివ్యమైన కలర్‌ప్రింట్స్‌కు, ఎన్లార్జిమెంట్సుకు, గెవాకలర్ నెగిటివ్ ఫిలిమ్ (ఎన్ 5) వాడండి. సహజమైన ఇటువంటి రంగుచిత్రాలు ఎంత సులువుగా తీయగలిగామా అని మీరే చకితులవుతారు. పూర్తితృప్తి కావాలంటే - నలుపు, తెలుపు లేక వర్ణచిత్రాల - ప్రింట్సుకు, ఎన్లార్జిమెంట్సుకు - గెవార్ట్ పేపరునే ఉపయోగించండి.

**GEVAERT**

ALLIED PHOTOGRAPHICS PRIVATE LIMITED.

## ఎల్లయిడ్ ఫొటోగ్రాఫిక్స్ ప్రైవేట్ లిమిటెడ్

కస్తూరి బిల్డింగ్, జంషెడ్జీతాతా రోడ్డు, బొంబాయి - 1.

# జాన్సన్ అండ్ జాన్సన్

## అందమైన పాపాయిలకు ఒక అద్భుతమైన పౌడరు




### ఉచిత పుస్తకము

పిల్లల సంరక్షణను గురించిన ఉచితముగా దొరకే జాన్సన్ యొక్క పుస్తకము కావాలని వ్రాయండి. దీనిలో తల్లి తండ్రులకు ఉపయోగపడే విషయములు ఎన్నో ఉన్నాయి. మీకు యింగ్లీషు మరియు హిందీ పుస్తకములలో ఏది కావాలో తెలపండి.

జాన్సన్ అండ్ జాన్సన్
పి.ఓ.బాక్స్ 1976. డిపార్టుమెంట్ 40-హెచ్, బొంబాయి

J B : 4163

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

తనకు గల దానిలో ఇతరులకుకూడా ఇంత పెట్టటం మానవుడి ఉత్తమ ధర్మం. దానం చేసే వారికి ఉత్తమ లోకాలు లభిస్తాయని పెద్దలు చెబుతారు. అయితే స్వార్థపరులు లోభబుద్ధిచేత తమకు గల దాన్ని ఇతరులతో పంచుకోలేరు సరేకదా, తమకు అయిన వారితోనే పంచుకోలేరు.

"దానహీనుడు" [జాతక కథ] లో పంచశిఖుడి కొడుకు పరమ లోభి. ఎనభైకోట్ల ఆస్తి ఉండి కూడా, తమ వంశాచారాన్ని మంట గలిపి, అయిదు తరాల వారు నడిపిన సత్రాలను నాశనం చేస్తాడు. చిట్టచివరకు తాను చక్కెరపొంగలి తినదలిచి, ఇంట్లో చేయిస్తే తన భార్యా తిని పోతుందేమోనని అడవిలోకి వెళ్లి చక్కెరపొంగలి తయారు చేయపూనుకుంటాడు. ఆ సమయంలో అతని పితృదేవతలు మానవరూపాలు దాల్చి దిగి వచ్చి అతనికి గుణపాఠం నేర్పి సన్మార్గవర్తిని చేయవలసి వస్తుంది.

సంపుటి 21 అక్టోబర్ 1957 సంచిక 4





# అట్టవిూది బొమ్మ

పాండవుల అజ్ఞాతవాసదీక్ష ముగిసేలోగా వారిని బయటపెట్టినట్టయితే, వారు మరొక పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసమూ, తిరిగి ఒక సంవత్సరం అజ్ఞాత వాసమూ చేయవలసి ఉంటుంది. అందుచేత దుర్యోధనుడు తన వేగులవారిని దేశదేశాలకు పంపి, పాండవులు ఎక్కడ ఉన్నదీ తెలుసుకురమ్మన్నాడు. వారు పట్టణాలూ, అడవులూ, కొండలూ సర్వం గాలించి తిరిగి వచ్చి పాండవుల జాడ ఎక్కడా దొరకలేదని చెప్పారు.

వెంటనే దుర్యోధనుడు భీష్మ ద్రోణాదులను చేర్చి కర్తవ్యం ఏమిటని అడిగాడు. వారు చనిపోయి ఉంటారని కొందరన్నారు. కృపాచార్యులు మాత్రం, "మనం అన్నిదేశాలమీద దండెత్తుదాం. బలహీనులతో సంధి చేసుకుందాం. పాండవులున్న ఏదేశం అయినా వారి అండచూచుకుని మనతో తప్పక యుద్ధానికి సిద్ధపడుతుంది. పాండవులు మహాశూరులు గనక ఆ యుద్ధంలో పాల్గొని మనకు దొరికి పోతారు," అన్నాడు.

దానిపై సుశర్మ ఇంకొక సూచనచేశాడు. "తన బావమరిది అయిన కీచకుడి అండచూసుకుని విరాటరాజు నాపై చాలాసార్లు దండెత్తివచ్చి, ఓడించాడు. ఇప్పుడా కీచకుణ్ణి కాస్తా గంధర్వులు సంహరించారు కనుక మనం యిప్పుడా దేశంమీద పడి అతణ్ణి సులువుగా జయించవచ్చు. నేను విరాటరాజుపై నా పగ తీర్చుకుంటాను," అన్నాడు.

దుర్యోధనుడు తన సేనను రెండుభాగాలుగా చేసి ఒకభాగం సుశర్మకిచ్చి మత్స్యదేశంమీద ఒకపక్కనుంచి దాడిచెయ్యమన్నాడు.

బహుళసప్తమినాడు సుశర్మ మత్స్యదేశంపైనపడి విరాటుడి గోగణాలను స్వాధీనపరుచుకున్నాడు.

ఈ వార్త తెలియగానే విరాటుడు యుద్ధానికి కదలి వెళ్లాడు. అయన వెంట బృహన్నల తప్ప మిగిలిన పాండవులుకూడా వెళ్లారు. ఈ యుద్ధంలో సుశర్మ విరాటుడిని ఓడించి ఖైదీగా పట్టుకున్నాడు. ఇది చూసి, ధర్మరాజు భీముణ్ణి, సుశర్మమీదికి యుద్ధానికి పంపాడు. భీముడు సుశర్మను ఓడించి, విరాటుడిని బంధ విముక్తుణ్ణి చేయటమేగాక, పారిపోతున్న సుశర్మను వెంబడించి అతణ్ణి ఖైదీగా పట్టుకున్నాడు.




# దానహీనుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఆయనవద్ద కోశాధికారిగా జన్మించాడు. ఆయన ఎనభైకోట్లకు అధిపతి అయి ఉండికూడా, ప్రపంచంమీద వైరాగ్యం కలిగి, తన ధనాన్ని రాజుగారిని స్వీకరించమని కోరాడు.

"నాకు ధనలోపం ఏమీ లేదు. అందుచేత నీ ధనాన్ని మరొక విధంగా విని యోగించుకో!" అని రాజు జవాబిచ్చాడు. అప్పుడు కోశాధికారి రాజుగారి అనుమతితో కాశీనగరంలో ఆరు అన్నసత్రాలు ఏర్పాటు చేశాడు. ఈ సత్రాలలో భారీగా దానధర్మాలు జరుగుతూ వచ్చాయి. ప్రతిరోజూ ఒక్కొక్క సత్రంలో ఒక్కొక్క లక్షచొప్పున ఖర్చు అవుతూండేది.

ఈ అన్నసత్రాలు ఏర్పాటు చేసిన ఫలితంగా కోశాధికారి చనిపోయిన అనంతరం స్వర్గంలో ఇంద్రపదవి సంపాదించాడు. ఆయన కుమారుడు తండ్రి అడుగుజాడలలోనే నడిచి చనిపోయి చంద్రుడుగా పుట్టాడు. చంద్రుడి కొడుకు సూర్యుడుగా పుట్టాడు. సూర్యుడి కొడుకు మాతలిగానూ, మాతలి కొడుకు పంచశిఖాగ్నిగానూ పుట్టి దేవత్వం సంపాదించుకున్నారు.

కాని పంచశిఖుడి కుమారుడి వద్దకు వచ్చేసరికి వంశాచారం నిర్మూలమై పోయింది. ఎందుచేతనంటే పంచశిఖుడి కొడుకు ఎనభైకోట్లకు అధిపతి అయినప్పటికీ పరమలోభి. అతన్ని ప్రజలు మచ్ఛరి కోశియుడని పిలిచేవారు. తన తండ్రి పోగానే అతను అన్నసత్రాలన్నీ మూయించి, భవనాలను తగలబెట్టించాడు. తన పూర్వీకులు కేవలం మూఢులై డబ్బంతా దానధర్మాలలో నష్టపరిచారని ఆయన అనుకున్నాడు.

అన్నసత్రాలు మూయగానే నగరంలోని బీద బిక్క జనం మచ్ఛరికోశియుడి ఇంటి



ముందు మూగి, "బాబూ, ధర్మం మాన కండి! సత్రాలు మూయకండి!" అని ఆక్రోశించారు. మచ్ఛరికోశియుడు మనుషులను పెట్టి ఈ పేదవాళ్లందరినీ తన ఇంటిముందు నుంచి గెంటించాడు.

మచ్ఛరికోశియుడు కోటీశ్వరుడు, తన తాత తండ్రులలాగే రాజుగారివద్ద కోశాధికారిగా పని చేస్తున్నాడు. కాని ఆయన తన డబ్బుతో ఎన్నడూ సుఖం అనుభవించి ఎరగడు. తాను ఎన్నడూ కడుపునిండా తిని ఎరగడు సరేకదా, తన భార్యా బిడ్డలను కూడా తిననిచ్చేవాడుకాడు. ఆయన గొడ్డు కారం మెతుకులు తిని పులిమజ్జిగ తాగేవాడు, నారబట్టలు కట్టుకునేవాడు, యిరుసులు అరిగిపోయిన పాతబండికి బక్కచిక్కన ఎద్దులు కట్టి, ఆ బండిమీద ఎక్కడికైనా వెళుతూండేవాడు.

ఒకనాడు ఈ పిసినిగొట్టు రాజసభకు పోతూ, ఉపకోశాధిపతినికూడా వెంటబెట్టుకు పోదామని వారిఇంటికి వెళ్ళాడు. సరిగా ఆ సమయానికి ఉపకోశాధిపతీ, ఆయన భార్యా, పిల్లలూ విస్తళ్ళముందు కూచుని చక్కెర పొంగలి తింటున్నారు. కోశాధికారిని చూడగానే ఉపకోశాధిపతి లేచి, ఆయననుకూడా చక్కెరపొంగలి తినటానికి రమ్మని ఆహ్వానించాడు.

"ఇప్పుడు నేను వీడి అతిథ్యం స్వీకరించి ఈ చక్కెరపొంగలి తింటే, రేపు నేను వీడి ఇంటిల్లిపాతినీ పిలిచి విందు చేయవలసి ఉంటుంది!" అని భయపడి మచ్ఛరికోశియుడు, "నాకు ఆకలి లేదు. నేనింతకుముందే కడుపునిండా తిని వచ్చాను. మీరు కానివ్వండి!" అన్నాడు.

కాని ఆ క్షణంనుంచీ మచ్ఛరికోశియుడికి చక్కెరపొంగలి తినాలని తీవ్రమైన కోరిక పట్టుకున్నది. కాని ఇంట్లో వండిస్తే తనతోబాటు ఇంకా చాలామంది తింటారు. అందుచేత ఆయన తన కోరికను ఎవరి





దగ్గిరా బయటపెట్టక, లోలోపల కుమిలి పోతూ, మనోవ్యాధితో మంచంపట్టాడు.

ఆయన భార్య వచ్చి, "మీకు వంట్లో జబ్బుగా ఉందా?" అని అడిగింది. "నీకే మైనా జబ్బేమో, నేను బాగానే ఉన్నాను!" అన్నాడాయన. కాని భార్య వదలిపెట్టక అసలుసంగతి తెలుసుకున్నది. అంతా విని ఆమె, "మనమేం దరిద్రులమా? చక్కెర పొంగలి కోసం మనోవ్యాధి పడాలా? కాశీ నగరంలో ఉన్న జనాభా కంతకీ చక్కెర పొంగలి వండిస్తాను!" అన్నది.

"మీ పుట్టింటివాళ్లు చాలా భాగ్యవంతు లని నాకు తెలుసులే. అక్కడినుంచి తవ్వి తెచ్చి ఊరంతకీ చక్కెర పొంగలి సంతర్పణ చెయ్యి!" అన్నాడు పిసినిగొట్టు. కనీసం వీధిలోవాళ్లందరినీ పిలుద్దామన్నది భార్య. వారందరితోటీ నీకేమిటన్నాడు భర్త. అయితే కనీసం మనింటిల్లిపాతికీ చక్కెర పొంగలి వండుతానన్నది భార్య. భర్త వీల్లేదన్నాడు.

"సరే అయితే మీకూ నాకూ వండు తాను," అన్నది భార్య.

"మధ్య నువు దేనికీ?" అన్నాడు భర్త.

"అయితే మీ ఒక్కరికోసమే వండు తాను. సరా?" అన్నది భార్య.

"అసలు ఇంటో వండటానికి వీల్లేదు. ఇంత బియ్యమూ, పాలూ, నెయ్యీ, తేనే నాచేతికియ్యి. వంటపాత్రలుకూడా ఇయ్యి. నేను అడివిలోకి వెళ్లి చక్కెర పొంగలి వండుకుని తింటాను!" అన్నాడు భర్త.

భార్య ఆయనకు కావలసిన వస్తువులన్నీ ఇచ్చింది. వాటిని ఒక బానిసవాడిచేత మోయించుకుని మచ్చరికోశియుడు తన నెత్తిన ముసుగు కప్పుకుని, నదీతీరం వెంబడి ఉండే అరణ్యానికి వెళ్ళాడు. నదీ తీరాన ఒక పొద పక్కన పొయ్యి ఏర్పాటు చేసి తన నౌకరుచేత వంటకట్టెలూ, నీరూ తెప్పించి, వాణ్ణి వెళ్లి రహదారిమీద నిలబడ



మన్నాడు. "ఒరే, ఎవరన్నా దారివెంట వస్తుంటే నాకు తెలియజెయ్యి. నీతో నాకు పని ఉంటే కేకవేస్తాను. నేను పిలిస్తేగాని రాకు!" అనివాడితో చెప్పాడు.

ఈ లోపల ఇంద్రుడు తన ఆరవ తరం వాడైన మచ్ఛరికోశియుణ్ణి గురించి తెలుసుకున్నాడు. "పంచశిఖుడుదాకా అందరూ దానధర్మాలు చేసి దేవత్వం పొందితే, పంచశిఖుడి కొడుకు పిసినిగొట్టయి, వంశాచారాన్ని మంటగలిపి, చక్కెరపొంగలి తాను ఒక్కడే తినగలందులకై అడివిలోకి వచ్చి వంట చేసుకుంటున్నాడు. నేను వీడికి జ్ఞానోదయం కలిగించకపోతే వీడు నరకానికి పోతాడు!" అనుకుని ఇంద్రుడు చంద్రుణ్ణీ, సూర్యుణ్ణీ, మాతలినీ, పంచశిఖుణ్ణీ పిలిపించి వారితో తాను చేయదలచిన పనిని గురించి చెప్పాడు.

తరవాత ఇంద్రుడు బ్రాహ్మణవేషం ధరించి మచ్ఛరికోశియుడు వంట చేసుకునే చోటికి వెళ్లి, "ఇదిగో, కాశీకి దారి ఎటు?" అని అడిగాడు.

"కాశీకి దారే తెలియదూ? ఇటుకేసి వస్తున్నావేమిటి? పో అవతలికి!" అని మచ్ఛరికోశియుడు కేకలు పెట్టాడు.

"ఎందుకలా అరుస్తున్నావు? చక్కెర పొంగలి చేస్తున్నావే? బ్రాహ్మణ సంతర్పణ చేస్తున్నావు కాబోలు. వాళ్లతోబాటు నేను కూడా పంక్తిని కూచుంటాను!" అన్నాడు ఇంద్రుడు నవ్వుతూ.

"సంతర్పణా లేదు, గింతర్పణా లేదు! పద, పద!" అని మచ్ఛరికోశియుడు అతణ్ణి అదిలించాడు.

"ఎందుకు నాయనా, అంత కోపగించుకుంటావు. అభ్యాగతిని, నీతోబాటు ఆ వండిన దేదో ఇంతపెడితే పుణ్యమేగాని పాపం రాదే!" అన్నాడు ఇంద్రుడు.

"నేను నీకు ఒక్క మెతుకుకూడా పెట్టను. ఇది నాకే చాలదు. నేనే ముష్టెత్తి

తెచ్చుకున్నాను, అందులో మళ్లీ నీకు ముష్టా? అదేం కుదరదు!" అన్నాడు మచ్ఛరికోశియుడు.

"కొంచెంలో కొంచెమే దానంచెయ్యి. ఎక్కువ ఉంటే ఎక్కువ దానంచెయ్యి. ఒంటిగా ఎన్నడూ తినరాదు. దానం వల్ల ఉత్తమ లోకాలు కలుగుతాయి!" అని ఇంద్రుడు బోధ చేశాడు. చిట్టచివరకు మచ్ఛరికోశియుడు, "సరే, అలా కూచో, నీక్కూడా కొంచెంగా చక్కెరపొంగలి పెడతాను!" అన్నాడు.

ఇంతలో చంద్రుడుకూడా బ్రాహ్మణవేషం ధరించి వచ్చి చక్కెరపొంగలి యాచించాడు. అతన్ని కూచోమనక మచ్ఛరికోశియుడికి తప్పలేదు. తరవాత సూర్యుడూ, మాతలీ, పంచశిఖుడుకూడా బ్రాహ్మణవేషాలలో వచ్చి తిష్ఠవేశారు.

త్వరలోనే చక్కెరపొంగలి తయారయింది. "వడ్డిస్తాను, ఆకులు తెచ్చుకోండి!" అన్నాడు మచ్ఛరికోశియుడు. బ్రాహ్మణులు చేతులు చాచేసరికి వారి చేతుల్లోకి పెద్దపెద్ద బండిచక్రాలంత తామరాకులు వచ్చాయి.

"ఇంతంతపెద్ద ఆకుల్లో నేను వడ్డించను. మందారపత్రాలలాటివి తెచ్చుకోండి!"



అన్నాడు మచ్ఛరికోశియుడు. వాళ్లు మందారపత్రాలు తెచ్చుకున్నా అవి పెద్ద అరటిఆకుల ప్రమాణంలో ఉన్నాయి. మచ్ఛరికోశియుడు చక్కెరపొంగలి వడ్డించాడు. వారందరికీ పెట్టినా పాత్రలో ఇంకా చాలా చక్కెరపొంగలి మిగిలిపోయింది.

ఇంతలో పంచశిఖుడు కుక్కరూపం ధరించి ఆ పాత్రలో మూతి పెట్టబోయాడు. సమయానికి మచ్ఛరికోశియుడు పాత్రకు తన చేతులు అడ్డం పెట్టాడు. కాని ఆయన చేతులకు కుక్క ఎంగిలి తగిలింది.

"నేను చెయ్యి కడుక్కోవటానికి కాసిని నీరు తెచ్చిపెట్టండి!" అని ఆయన బ్రాహ్మ

ణులను కోరాడు. వారు నిర్మొహమాటంగా, "మేము తీసుకురాము!" అని చెప్పారు.

"నా చక్కెరపొంగలి తింటూ ఆమాత్ర మైనా విశ్వాసం లేదా?" అని మచ్ఛరికోశియుడు వారిని అడిగాడు. వారు ససేమిరా తీసుకురామన్నారు. "అయితే నా పాత్రను కాస్త చూస్తూ ఉండండి. నేనే వెళ్ళి నీరు తెచ్చుకుంటాను!" అంటూ మచ్ఛరికోశియుడు నదివద్దకు దిగి వెళ్లసాగాడు. వెంటనే కుక్క చక్కెరపొంగలి వున్న పాత్రలో మూతిపెట్టేసింది.

మచ్ఛరికోశియుడికి కోపం వచ్చి, ఒక కర్ర తీసుకుని కుక్కవెంట పడ్డాడు. అయితే ఆ కుక్క అంతలోనే గుర్రం ఆకారం ధరించి మచ్ఛరికోశియుణ్ణే తరమసాగింది. అది క్షణక్షణానికీ రంగులు మారుతూ, కాస్సేపు చిన్నదవుతూ, కాస్సేపు పెద్ద దవుతూ కనపడింది. మచ్ఛరికోశియుడు ప్రాణభీతితో గిజగిజలాడాడు. అతడు బ్రాహ్మణులను, "బాబూ, నన్ను ఈ గుర్రం బారినుండి రక్షించండి!" అని కోరాడు.

వెంటనే ఆ అయిదుగురు తమ నిజ స్వరూపాలతో గాలిలోకి లేచి నిలబడ్డారు.

"మీరు మనుషులు కారు, దేవతలు! మీ పేర్లేమిటో, ఎందుకు దయచేశారో చెప్పండి!" అన్నాడు మచ్ఛరికోశియుడు.

"మేము నీ పితృదేవతలం. మానవ జన్మ ఎత్తి దానాలుచేసిన ఫలితంగా దేవత్వం సంపాదించుకున్నాం. నువు లోభివై, వంశాచారాన్ని మంట గలిపి నరకం సంపాదించుకుంటున్నావు. నీకు గుణపాఠం చెప్పే నిమిత్తమై వచ్చాం! ఇంటికి పోయి దానధర్మాలు చేసి మాలాగే దేవత్వం సంపాదించుకో!" అన్నాడు ఇంద్రుడు.

మచ్ఛరికోశియుడి బుద్ధి మారిపోయింది. ఆయన ఇంటికి వెళ్ళి తన ధనమంతా పేదలకు దానం చేసి, తపస్సు చేసుకోవటానికి హిమాలయాలమీదికి వెళ్ళిపోయాడు.






## 10

[భల్లూకకేతుడు రక్కసిమూకకు నాయకుడుగా వుండేందుకు అంగీకరించలేదు. చేసేదిలేక పద్మపాదుడు తిరిగి తన దేశానికి బయలుదేరాడు. అక్కడ పింగళుడు, పద్మపాదుడికి వారం రోజులు అతిథిగావుండి, తరవాత తన యిల్లు చేరాడు. ఇంటిముందు అతడికి, తన తల్లి దీనంగా బిచ్చం అడుగుతూ వుండటం కంటబడింది. తరవాత—]

పింగళుడి కంఠస్వరం వింటూనే, తల్లి అతణ్ణి గుర్తించి, కళ్లవెంట జలజల నీరు కారుస్తూ, "నాయనా, ఎన్నాళ్లకు నిన్ను చూడగలిగాను!" అంటూ అతణ్ణి కావిలించుకున్నది. పింగళుడు ఆమెను ఓదారుస్తూ, "అమ్మా, నీ స్థితి యిలా అవటానికి కారణం ఏమిటి? నేను ప్రయాణం అయి వెళ్లేముందు నీకు వెయ్యి మొహరీలు యిచ్చానుగదా? ఆ డబ్బు ఏమయింది? యింతకూ నా అన్నలు ఎక్కడ వున్నారు?" అని అడిగాడు. తల్లి వెంటనే జవాబు చెప్పలేక కొట్టుమిట్టాడింది. చివరకు ఆమె కళ్లనీళ్లు తుడుచుకుంటూ, "నీ అన్నలవల్లనే నాకీ కష్టాలన్నీ వచ్చాయి. నువు అటు వెళ్లగానే, వాళ్ళిద్దరూ నన్ను తిట్టి కొట్టి, ఆ వెయ్యి మొహరీలూ లాక్కుపోయారు" అన్నది.

తల్లి మాటలు వింటూనే పింగళుడు నిశ్చేష్టుడయాడు. కన్న తల్లిని హింసించే కటికదుర్మార్గులు తన అన్నలన్న సంగతి అతడికి చాలా బాధ కలిగించింది. అయినా, తనకైతాను ఆ సోదరులను హతమార్చ ప్రయత్నించటం ధర్మం అనిపించుకోదు.



పింగళుడు బక్కచిక్కిపోయిన తల్లిని లేవనెత్తి యింట్లోకి తీసుకుపోతూ, "అమ్మా, యిక నీవు దుఃఖించవలసిన అవసరం లేదు. భగవంతుడి దయవల్ల నేను అన్ని పరీక్షలకూ నిలబడి, ఎంతో డబ్బుతో యిల్లు చేరాను. నీ కష్టాలూ నా కష్టాలూకూడా యీనాటితో తీరిపోయినై," అంటూ తను వెంట తెచ్చిన సంచీమూత వూడదీసి, అందులో వున్న బంగారం, రత్నాలూ, మణులూ తల్లికి చూపించాడు.

తల్లి ఆనందానికి మేరలేదు. ఆమె రెండు చేతులతో సంచీలో వున్న బంగారాన్నీ, యితర విలువైన వస్తువులనూ తాకి



చూస్తూ, "నాయనా, నువ్వు అదృష్టశాలివి! అందువల్లనే ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని కూడా క్షేమంగా బయటపడగలిగావు. నాకు ఆకలి దహించుకుపోతున్నది. ముందు బజారుకు వెళ్లి, యిన్ని రొట్టెలూ, ఏదైనా కూరా తెచ్చిపెట్టు!" అన్నది.

తల్లిమాటలకు పింగళుడు పకాలున నవ్వాడు. తరవాత ఆమెను గోడపక్కనే వున్న ఒక పీటమీద కూర్చోపెట్టి, ముందు పెద్ద విస్తరి పరిచి, తనవెంట వున్న మంత్రాల సంచిని ఆమెకు చూపిస్తూ, "అమ్మా, నీకు ఎలాంటి పదార్థాలు కావాలో కోరుకో! అన్నం, కూరలే కాదు, ఎన్ని రకాల పిండివంటలైనా సరే, క్షణంలో నీకు సమకూరుస్తాను," అన్నాడు.

"పింగళా, ఆకలితో ప్రాణం కడబడుతున్న నాకు పిండివంటలెందుకు? ముందు బజారుకు వెళ్లి యిన్ని రొట్టెలు పట్టుకురా, చాలు!" అన్నది తల్లి.

పింగళుడు తల్లి పక్కనే కూర్చుని సంచీలోకి చేయి పోనిచ్చి, మంత్రం పఠించి, అందులోనుంచి వేడివేడిగా వున్న రొట్టెలను బయటికి లాగాడు. యిదేదో వింతగా భావించి, ఆశ్చర్యపడుతున్న తల్లి మారు మాటాడకముందే, పింగళుడు సంచీలోంచి





ఒక్కొక్కటిగా పంచభక్ష్య పరమాన్నాలూ, నూటఒక్క పిండివంటలూ బయటికి లాగి, తల్లి ముందున్న విస్తట్లో, దాని చుట్టూ దొంతర్లుగా అమర్చాడు.

తల్లి ఆశ్చర్యానికి అంతులేదు. ఆమె తన ముందున్న తినుబండారాలకేసి కళ్లింత చేసుకు చూస్తూ, "నాయనా, యిది మంత్రమో, మహత్తో నాకు తెలియటంలేదు. అంత చిన్న సంచీలో యిన్ని పదార్థాలు ఎలా దాచగలిగావు?" అని అడిగింది.

పింగళుడు, మంత్రాల సంచిని మడిచి తన పక్కన పెట్టుకుని, ఒక్కొక్క వంట కాస్సే రుచిచూస్తూ, "అమ్మా, అదంతా తరవాత చెపుతాను. ముందు భోజనం ముగించు," అన్నాడు.

కొద్దిసేపట్లో పింగళుడితోపాటు తల్లికూడా తృప్తిగా భుజించింది. పింగళుడు ఖాళీ పళ్లాలన్నిటినీ తిరిగి సంచీలో పెట్టి, దాన్ని తల్లికి అందిస్తూ, "అమ్మా, యీనాటినుంచి నువ్వు వంట చేయనవసరం లేదు. యీ సంచీలో అద్భుతమైన ఒక శక్తి వుంది. దాని ప్రభావంవల్ల మనం ఎలాంటి వస్తువును కోరుకుని, అందులో చెయి పెడతామో, ఆ వస్తువు వెంటనే లభిస్తుంది. ఆ సమయంలో మనం పఠించవలసిన మంత్రం



యిది!" అంటూ తల్లి చెవిలో మంత్రం చెప్పి, "ఈ రహస్యం మాత్రం ఎవరికీ తెలియనివ్వకు!" అన్నాడు.

అంతలో వీధివాకిట్లో ఎవరో పెద్దగా ఏడుస్తూ తల బాదుకుంటున్న ధ్వని అయింది. పింగళుడు అదేమిటో తెలుసుకునేందుకు వీధివాకిలి తెరిచి బయటికి చూచాడు. ఎదురుగా, గుమ్మం పక్కన అన్నలిద్దరూ—జీవదత్తుడూ, లక్షదత్తుడూ చిరిగి మట్టి కొట్టుకున్న గుడ్డలతో, చింపిరితలలతో భోరున ఏడుస్తూ అతడికి కనిపించారు.

తన అన్నలిద్దరూ అంత దీనావస్థలో కనబడేసరికి, పింగళుడిలో వారిమీద ఎక్కడ



లేని సోదరప్రేమా వెల్లివిరిసింది. అతడు వారిని సమీపించి, "అన్నల్లారా, ఏడవకండి! దైవకృపవల్ల నేను యింత ధనం సంపాయించి, క్షేమంగా యింటికి తిరిగొచ్చాను. మన కష్టాలన్నీ తీరినై, యిక మనం హాయిగా బతకవచ్చు," అన్నాడు.

పింగళుడు యిలా అనేసరికి జీవదత్తుడూ, లక్షదత్తుడూ ముఖముఖాలు చూసుకున్నారు. ఆ వెంటనే జీవదత్తుడు మరింత పెద్దగా ఏడుస్తూ తల బాదుకుని, "తమ్ముడూ, పింగళా! ఈ రోజుతో మా జీవితాలు ముగిసినట్టే. మేము అమ్మకు ఎంత అన్యాయం చేశామో, ఆమె నీకు చెప్పేవుంటుంది. ఇక ఏముఖం పెట్టుకుని మేము యీ యింట్లో అడుగుపెట్టగలం! యింత కాలంగా నీ రాకకోసమే ఎదురు చూస్తున్నాం. నిన్నొక్కమారు తుదిసారిగా చూసి, ఆ చిలకసరస్సులో పడి చావదలుచుకున్నాం. అప్పుడుగాని మా పాపాలకు తగిన ప్రాయశ్చిత్తం జరగినట్టు కాదు. అమ్మకు వేయి నమస్కారాలు. మా తప్పుల్ని క్షమించు, యిక శెలవు!" అంటూ వెనుదిరిగాడు. అతడితోపాటే లక్షదత్తుడు కూడా బయలుదేరాడు.

పింగళుడు చెంగున ఒక్క గంతులో అన్నలిద్దరికీ అడ్డంగా నిలబడి, "అన్నల్లారా,



ఆగండి! యిప్పుడు మీరెక్కడికి వెళుతున్నారు?" అన్నాడు.

"ఎక్కడికా? అహ్హహ్హ!" అంటూ జీవదత్తుడూ, లక్షదత్తుడూ కూడా పిచ్చి వాళ్లలా వికటంగా నవ్వి, "తమ్ముడూ, దారి తొలుగు! మా పాపాలకు ప్రాయశ్చిత్తం జరిగితీరవలసిందే! తల్లిని రంపాన రాసిన పాపులకు, ఆ చిలకసరస్సే శరణ్యం!" అంటూ ముందుకు నడవ బోయారు.

ఇంతలో తల్లికూడా వీధివాకిలి దగ్గిరకు వచ్చి, తన పెద్దకొడుకులిద్దర్నీ చూసి ఎంతో జాలిపడింది. ఆమె ఆ క్షణంలో, వాళ్లిద్దరూ తనకు గతంలో చేసిన అన్యాయాన్ని మర్చిపోయి, ఎక్కడలేని పుత్రప్రేమతో వారిని సమీపించి, "నాయనలారా, ఏడవకండి! దేవుడి దయవల్ల మీ చిన్నతమ్ముడు, ఎంతో ధనం సంపాయించి తిరిగివచ్చాడు. జరిగి పోయినదాన్ని మరిచిపోయి, యిక నుంచైనా సుఖంగా కాలక్షేపం చేద్దాం!" అన్నది.

"అయితే మా పాపాలకు ప్రాయశ్చిత్తం మాటేమిటి?" అన్నారు జీవదత్తుడూ, లక్షదత్తుడూ, ఏకకంఠంతో.

"పశ్చాత్తాపం అనేది అన్ని పాపాలను హరిస్తుంది. యిక వెనుదిరిగి యింట్లోకి రండి!" అన్నాడు పింగళుడు, జీవదత్తుడి చెయ్యి పట్టుకుంటూ.





తల్లినీ, పింగళుణ్ణీ ఎంతో ఆప్యాయంగా కావిలించుకుని, "తినటాని కేమైనా వుంటే పెట్టండి, ఆకలి దహించేస్తున్నది," అన్నారు.

పింగళుడు మంత్రాలసంచీ తీసుకుని వంటగదిలోకి వెళ్ళి, తల్లికి దాన్నియిచ్చి, అన్నలదగ్గిరకు వచ్చి కూచున్నాడు. నాలు గైదు నిమిషాల తరవాత తల్లి రకరకాల భోజనపదార్థాలు పళ్ళాల్లో పెట్టుకుని వచ్చి పెద్దకొడుకుల ముందు పెట్టింది.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ అవురావురు మంటూ కొంతసేపు తిని, "అమ్మా, యిన్ని పదార్థాలు వండావెందుకు? మేమే మీ అతిథులం కాదుగదా! అనవసరంగా డబ్బు ఖర్చు," అన్నారు.

పింగళుడు నవ్వుతూ, "అన్నల్లారా! మనం ప్రతిరోజూ యిలాంటి భోజనమే చేయ వచ్చు. కావాలంటే, యీ పట్టణంలో వున్న బీదసాదలకు కూడా, యింత విలువగల భోజనం పెట్టవచ్చు," అన్నాడు.

పింగళుడి మాటలు వింటూనే జీవ దత్తుడు లక్షదత్తుడికి సంజ్ఞచేశాడు. అతడు కూడా ఏదో అర్థమైందన్నట్టు తల వూపి వూరుకున్నాడు.

ఆ రాత్రి భోజనాల తరవాత జీవదత్తుడూ, లక్షదత్తుడూ చల్లగాలికి వీధిలోకి వెళ్ళివస్తా

తల్లికూడా తన పెద్దకొడుకులకు అడ్డుగా నిలబడి, "నాయనలారా, యిక యింట్లోకి పదండి! చిన్నతనంవల్ల, మీరు తెలిసీతెలి యక నాకేమైనా అన్యాయం చేసివుంటే, తల్లినైన నేను మర్చిపోగలను," అంటూ కొడుకు లిద్దరి చేతులూ పట్టుకున్నది.

ఆ తరవాత అయిష్టంగానే ముక్కుతూ, మూలుగుతూ, జీవదత్తుడూ, లక్షదత్తుడూ యింట్లోకి వచ్చారు. తల్లి అప్పటికప్పుడు వాళ్ళిద్దరికీ స్నానానికి నీళ్ళుతోడి, కట్టు కునేందుకు పింగళుడు వెంటదెచ్చిన ఖరీదైన పట్టువస్త్రాలు యిచ్చింది. వాళ్ళిద్దరూ స్నానాలుచేసి, ఆ పట్టుదుస్తులు ధరించి,





మని బయలుదేరారు. వాళ్ళిద్దరికీ పింగళుడు చాలాధనం వెంటబెట్టుకు వచ్చాడనేది తెలిసిపోయింది. ఆ డబ్బు దొరకపుచ్చుకోవటం ఎట్లా? అన్నది వాళ్ళకు పెద్ద సమస్య. యింకోటి: జీవదత్తుడికి తన తల్లి ఆ ఉదయంగాని, సాయంకాలంగాని, పొయ్యి రాజేసినట్టు కనబడలేదు. అతడు వంటగదిలోకి వెళ్ళి, గదంతా పరీకించి వచ్చాడు. వంట చెయ్యకుండానే, యిన్ని పదార్థాలు ఎక్కడనుంచి వస్తున్నవో అతడికి అర్థంకాలేదు.

"పింగళుడు చాలా డబ్బు తెచ్చాడు, అందులో సందేహం లేదు. పోతే, దాన్ని మనం దొరకపుచ్చుకోవాలంటే మరి కొంత కాలం పడుతుంది. మనం పశ్చాత్తాపపడుతున్నామని అమ్మతోపాటు వాడికీ నమ్మకం కుదిరింది. అది అట్లా వుంచుదాం. మనం యీ రెండుపూటలా విందుభోజనాలు చేశాం కదా! వంటింట్లో చూస్తే పొయ్యి రాజేసిన లక్షణాలే లేవు. ఇది వింతగా లేదా?" అన్నాడు జీవదత్తుడు.

లక్షదత్తుడు ఆశ్చర్యపడుతూ తల పంకించి, "అలా అయితే, పింగళుడు ఏదో మంత్రమో తంత్రమో నేర్చుకు వచ్చి, యిదంతా చేస్తూవుండివుండాలి. అందుచేతే



వాడు అంత ధీమాగా పట్టణంలో వున్న బీదసాదలందరికీ యీ భోజనమే పెట్టవచ్చని అన్నాడు. సమయం కనిపెట్టి అమ్మ నడిగితే, యీ రహస్యం బయట పెట్టేస్తుంది," అన్నాడు.

అన్నదమ్ములిద్దరూ మర్నాడు పింగళుడు యింట లేని సమయం కనిపెట్టి, తల్లిపక్క చేరి, యీ సంగతి అడిగారు. ఆమె చాలా సేపటి వరకూ పింగళుడు తెచ్చిన మంత్రాల సంచీని గురించి చెప్పలేదు. కాని కొడుకులిద్దరూ బతిమాలేసరికి, మరెవరికీ తెలియకూడని రహస్యం అంటూ, మంత్రాలసంచీ తెచ్చి వాళ్ళిద్దరికీ చూపింది.



"అమ్మా, ఆ మంత్రం ఏదో నాకు చెప్పు! నాకు యీ క్షణాన జిలేబీలు తినాలని వుంది," అన్నాడు జీవదత్తుడు.

తల్లి కొడుకులమీది ప్రేమకొద్దీ, వాళ్లు లోగడ తనను పెట్టిన హింసలు మరిచిపోయి, వాళ్లకు ఆ మంత్రం చెప్పి, సంచీలోంచి వాళ్ల చేతే, కావలసిన పదార్థాలన్నీ బయటికి తీయించింది. దానితో జీవదత్తుడీ, లక్ష దత్తుడీ ఆనందం హద్దులు దాటిపోయింది.

ఆ రాత్రి వాళ్ళిద్దరూ పింగళుడిమీదా, తల్లిమీదా కుట్ర పన్నారు. ముందు పింగళుణ్ణి యింట్లో లేకుండా చేస్తే, తల్లి తమనేమీ చేయలేదని వాళ్లకు తెలుసు. అయితే, పింగళుణ్ణి వదిలించుకోవటం ఎట్లా?

"మొన్న పెద్దబజారున వస్తూంటే, ఒక ఓడసరంగు కనిపించాడు. అతడికి సముద్రాలమీద పడవలు నడిపేందుకు యువకులైన నావికులు కావాలట! అవసరం అయితే, ఎంత డబ్బయినా యిచ్చి, ఇంటి పెద్దలనుంచి యువకులను కొంటున్నాడు. మనం అయనతో మాట్లాడి, పింగళుణ్ణి అతడికి అమ్మేద్దాం! మనం, యీ యింటికి పెద్ద వాళ్ళం గదా?" అన్నాడు జీవదత్తుడు.

"మంచి యోచన! ఆ సరంగును కలుసుకుని మాట్లాడదాం పద," అన్నాడు లక్షదత్తుడు. అన్నదమ్ములిద్దరూ కలిసి సరంగు విడిదిచేసిన యింటికి పోయారు. అతడు వీళ్ళకు అన్ని మర్యాదలూ చేసి వచ్చిన పనేమిటని అడిగాడు. అప్పుడు జీవదత్తుడు లేని దుఃఖం తెచ్చిపెట్టుకుని, "అయ్యా, సరంగుగారూ! మా తమ్ముడు పింగళుడనే వాడొకడున్నాడు. వాడు పత్తి గడుగ్గాయిలా తయారై యింటిపట్టున వుండక, అవసరం అయినప్పుడల్లా వృద్ధురాలైన మా అమ్మనూ, మమ్మల్నీ హింసించి డబ్బు గుంజుకు పోతూంటాడు. వాడిని వదిలించుకోవటం ఎలాగో మాకు తెలియకుండా వుంది," అన్నాడు విచారంగా. (ఇంకా వుంది)



# అవివేకం

కేరళదేశంలో ప్రసేనుడనే రాజుకు ఒక దారుణమైన వ్యాధి వచ్చింది.

"మహారాజా, మీరు నెత్తిన చకోరపక్షిని పెట్టుకుని స్నానం చేస్తేగాని ఈ వ్యాధి కుదరదు," అని రాజవైద్యుడు చెప్పాడు.

రాజు, బోయవాళ్లను పిలిపించి, "ఒరే మీరు ఎలాగైనా ఒక చకోరపక్షిని పట్టుకు వచ్చారంటే మీకు మంచి ఈనామిస్తాను," అన్నాడు.

బోయలు అడవిలో వల పన్నారు. అందులో ఒక కొంగ చిక్కుకున్నది. దాన్ని విడిపించబోయి ఒక చకోరపక్షి తానుకూడా వలలో చిక్కుకున్నది.

"నన్ను వదిలెయ్యండి. మీకు పెద్ద నిధి చూపిస్తాను!" అన్నది చకోర పక్షి బోయలతో. వారు వినిపించుకోక దాన్ని తీసుకుపోయి రాజుకిచ్చారు.

రాజవైద్యుడు ఆ పక్షిని రాజు తలపై పెట్టి, స్నానం చేయించాడు. రోగం నయమయింది. రాజు సంతోషించి పక్షిని విడిచిపెట్టాడు.

పక్షి ఆకాశానికెగిరి, "రాజా, నేను మొదట అవివేకిని, కొంగను రక్షించ బోయి వలలో చిక్కుకున్నాను. నీ బోయలుకూడా అవివేకులే. నీ ఈనాముకు ఆశపడి నేను చూపిస్తానన్న నిధిని పోగొట్టుకున్నారు. మా అందరికన్న అవివేకివి నీవు. నా నీరు తగిలితేనే భయంకరమైన వ్యాధి నయమైనప్పుడు నన్ను చంపి తింటే ఎంతలాభించేదో ఊహించలేక పోయావు!" అంటూ వెళ్లిపోయింది.

—యల్లాప్రగడ శివశంకర భగవానులు



# చికిత్స పొందిన అంతరాత్మ



విసుగుచెందన విక్రమార్కుడు మరొకసారి చెట్టువద్దకు వెళ్ళి, చెట్టుమీదినుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలో ఉన్న బేతాళుడు, "రాజా, నువు ఈ అర్ధరాత్రివేళ ఈ ప్రయాస అంతా నీ అంతరాత్మ ప్రేరణ చేత పడుతున్న పక్షంలో నేనొక సలహా ఇస్తాను. అదేమంటే, అంతరాత్మలు నమ్మదగినవి కావు. కొంతకాలంపాటు అవి ఆనందం ఇచ్చినా చివరకవి భీతికలిగిస్తాయి. ఇందుకు ఉదాహరణగా నీకు హిరణ్యగుప్తుడి కథ చెబుతాను, విను!" అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

పూర్వం అలకానగరంలో హిరణ్యగుప్తుడనే వ్యాపారి ఉండేవాడు. ఆయనకు నగరంలో చాలా పెద్దదుకాణం ఉండేది. అందులో దొరకని వస్తువంటూ లేదు. రోజూ అనేక వందలమంది ఆ దుకాణంలో వస్తు

## బేతాళ కథలు

వులు కొనుక్కుపోతూ ఉండేవారు. కాని ఎన్నిఏళ్లు వ్యాపారం చేసినా దుకాణంమీద కొంచెంకూడా లాభం లేకపోయింది.

దీనికి కారణమేమంటే హిరణ్యగుప్తుడు మెతకస్వభావం కలవాడు. దుకాణానికి పేదవాళ్లు వస్తే వారికి అప్పుపెట్టేవాడు. ఆ బాకీ ఎన్నటికీ తీరకపోగా, పాపంపెరిగినట్టు పెరిగేది. చిన్నపిల్లలెవరన్నా వస్తే వాళ్లకు తినటానికి అదీ ఇదీ పెట్టేసేవాడు. ఎక్కువ ధరలు చెప్పటమూ, తక్కువ తూకాలు తూయటమూ అతనికి కొంచెంకూడా చాతనయేదికాదు. అందువల్ల అప్పులు పెట్టటం చేత వచ్చిన నష్టం ఇంకోరకంగా పూడే అవకాశం లేకపోయింది.

హిరణ్యగుప్తుడికి ఇంకొక దురలవాటు కూడా ఉండేది. వస్తువులు కొన్నవారు తన చేతిలో వేసే డబ్బులు సరిగా ఉన్నాయో లేదో చూసుకునే ఓపిక అతనికి ఉండేది కాదు. ఈ సంగతి తెలుసుకుని పోకిరీవాళ్లు పూటాసొమ్ము అతని చేతిలో పెట్టేవాళ్లు. వాటికేసి చూడకుండానే అతను వాటిని తన గల్లాపెట్టెలో వేసుకునేవాడు. ఇందువల్ల, అలకానగరంలో ఉన్న పూటానాణాలలో సగానికి పైగా హిరణ్యగుప్తుడి గల్లాపెట్టె లోనే ఉండేవి!



ఎంతమంది ఎన్నిసార్లు మోసగించినా హిరణ్యగుప్తుడు అందరినీ నమ్మేవాడు, ఏమాత్రం కష్టంలో ఉన్నవారిని చూసినా జాలిపడేవాడు. ఈ నమ్మకం మూలంగా ఏ బ్రాహ్మడు తులసితీర్థం తెచ్చి ఇచ్చినా, ప్రసాదం తెచ్చి ఇచ్చినా, వారికి అడగకుండానే స్వయంపాకం ఇచ్చి పంపేవాడు.

హిరణ్యగుప్తుడి భార్య నెత్తీ నోరూ కొట్టుకునేది. "ఇన్నేళ్ళుగా దుకాణం నడుపుతూ ఇంకొకడైతే లక్షలు గడించి ఉండును. నీ మొహానికి ఏమీలేదు. రాబడికన్న అప్పులు జాస్తి. ఇట్లా ఎంతకాలం జరుగుతుంది?" అని మొగుణ్ణి శాపనార్థాలు పెట్టేది.

"ఇంతకాలం వెళ్ళలేదా? ఇట్లాగే వెళు తుంది! మూడు రోజులుగా గంజి అయినా తాగలేదని ఏడిచే మనిషికి సోలెడు నూకలు అప్పిస్తే అదో పెద్ద తప్పా?" అనేవాడు హిరణ్యగుప్తుడు.

"అయితే ఉన్నదంతా పందారం చేసెయ్యి. వ్యాపారంకూడా ఎందుకూ?" అనేది భార్య.

ఇంతలో ఒక దారుణం జరిగింది. హిరణ్యగుప్తుడు తన గల్లాపెట్టెలో డబ్బు ఎంచుకుంటూ ఉండగా అందులో ఒక ఇత్తడి బిళ్ళ కనిపించింది. అది చూడ టానికి బంగారు మొహరులాగే ఉందిగాని, నిజానికి ఇత్తడిమొహరు. ఆ మొహరును తనకు ఎవరిచ్చారో హిరణ్యగుప్తుడికి చచ్చినా జ్ఞాపకం రాలేదు.

ఆ రోజు హిరణ్యగుప్తుడి భార్య మహా కాళిలా విజృంభించింది. "నువు వట్టి మూఢుడివి. ఈ సంగతి అలకానగరంలో వున్న అందరికీ తెలిసిపోయింది. నిన్ను చూసి అందరూ నవ్వుతున్నారు!" అని ఎత్తిపొడిచింది.

హిరణ్యగుప్తుడికి రోషం వచ్చింది. "ఈ మోసం ఎవరు చేశారో తెలుసుకోకుండా వదులుతాననుకున్నావా?" అన్నాడు అతడు భార్యతో.



అలకానగరంలో ఒక బేతాళ మాంత్రికుడున్నాడు. ఆయన చాలా సిద్ధులు గలవాడు; ఏవో మంత్రాలు నేర్చి పిశాచాలను వదలగొట్టే మామూలు మాంత్రికుడు కాడు. తనకు పూటామొహరు అంటగట్టిన వారెవరో తెలుసుకోవటానికని హిరణ్యగుప్తుడు ఈ బేతాళమాంత్రికుడి వద్దకు వెళ్ళాడు.

బేతాళమాంత్రికుడు హిరణ్యగుప్తుణ్ణి కూచోబెట్టి, "ఏం పనిమీద వచ్చావు?" అని అడిగాడు.

హిరణ్యగుప్తుడు తన పైబట్ట కొంగునుండి పూటామొహరు తీసి మాంత్రికుడికి చూపిస్తూ "స్వామీ, ఈ ఇత్తడిబిళ్ళను మొహరు కింద నాకెవరో అంటగట్టారు. ఆ పని చేసినదెవరో నాకు తెలియజేస్తే తమకు ఏదైనా కట్నం ఇచ్చుకుంటాను!" అన్నాడు.

మాంత్రికుడు విరగబడి నవ్వాడు. చివరకాయన, "ఓరీ మూఢుడా! ఇది ఎవరిచ్చారో ఇప్పుడే చెప్పగలను. కాని దానివల్ల నీకేం ప్రయోజనంరా? రేపు మళ్ళీ ఇంకొకరు నీ దుకాణానికి వచ్చి ఇలాగే నిన్ను మోసగిస్తారు. అసలు నీలో ఉండే వ్యాధికి చికిత్స జరగాలిరా!" అన్నాడు.

"వ్యాధా? నాకే వ్యాధీ లేదు, స్వామీ! పిడిరాయిలాగున్నాను. ఏనాడూ చిరుస చీది ఎరగను!" అన్నాడు హిరణ్యగుప్తుడు.





"ఓరీ మూఢుడా! నీకు చత్వారం లేదు(టా?" అన్నాడు మాంత్రికుడు గద్దించి.

"కొంచెంకూడా లేదు, స్వామీ! మైలు దూరాన ఉన్న మనిషినికూడా ఇట్టే పోల్చ గలను, అరిచేతిలో ఆవగింజలు లెక్కించ గలను!" అన్నాడు హిరణ్యగుప్తుడు, మాంత్రి కుడి కేసి వినయంగా చూస్తూ.

మాంత్రికుడు మళ్లీ నవ్వాడు. "నీ చత్వారం కళ్ళకు సంబంధించినది కాదురా! నీ అంతరాత్మకు సంబంధించినది. నీ అంత రాత్మ చాలా తీవ్రమైన వ్యాధితో తీసుకుం టున్నది. నువు డబ్బుకేసి సరిగా చూడ లేవు. ఎవరైనా బీదవాళ్ళను చూడగానే నీ గుండె దడదడలాడిపోతుంది. అవునా?" అన్నాడు మాంత్రికుడు.

"అందులో జబ్బేముంది, స్వామీ?" అన్నాడు హిరణ్యగుప్తుడు.

"కాస్తా కూస్తా జబ్బా? ఈ జబ్బుతో నువు వ్యాపారం ఏంచేస్తావురా? మరి అయి దారేళ్ళ కాలంలో నీ వ్యాపారం దివాలా తీస్తుంది. చూడటానికి చిల్లిగవ్వయినా నీ కంట పడదు. నీకూ, నీ పిల్లలకూ ఎవరైనా గంజినూకలు అప్పివ్వవలిసి వస్తుంది. నీ అంతరాత్మకు పట్టిన వ్యాధి మహా భయం కరమైనది! దాన్ని చికిత్సచేసుకుని బాగు పడతావా? లేక ఆ వ్యాధితో అడుగంటి పోతావా? ఏదో ఒకటి తేల్చుకో!" అన్నాడు బేతాళమాంత్రికుడు.

హిరణ్యగుప్తుడు హడిలిపోయాడు. అత నికి వ్యాపారంతో నాలుగు కాలాలపాటు బతికి బాగుపడాలనే ఉన్నది. అందుచేత మాంత్రికుణ్ణి, "స్వామీ, నా జబ్బు ఎలా పోగొడతారు? దానికి నేనేం చెయ్యాలి? తమకు ఎంత కట్నం ఇచ్చుకోవాలి?" అని ఆదుర్దాగా అడిగాడు.

"అష్టసిద్ధులు గలవాణ్ణి నాకు నీ కట్నం ఎందుకురా? నీ అంతరాత్మను నావద్ద ఉంచిపో! వచ్చే అమావాస్యనాటికి దానికి

పూర్ణారోగ్యం కలిగించి మళ్లీ నీ పరం చేస్తాను !" అన్నాడు మాంత్రికుడు.

"నా అంతరాత్మ నాలో ఉంటుందిగదా, దాన్ని తమకెలా ఇవ్వగలను, స్వామీ ?" అన్నాడు హిరణ్యగుప్తుడు.

"నీ అంతరాత్మను నా కివ్వటానికి సమ్మతించరా ! దాన్ని ఎలా తీసుకోవాలో, ఏం చెయ్యాలో నేను చూసుకుంటాను !" అన్నాడు మాంత్రికుడు.

"అలాగే తీసుకోండి, స్వామీ !" అన్నాడు హిరణ్యగుప్తుడు.



మాంత్రికుడు కళ్ళుమూసుకుని ఏదో ఉచ్చరించి, "జై బేతాళా !" అని పెద్దగా అరిచి, రెండు చేతులతోనూ దోమను పట్టుకున్నట్టు ఏదో పట్టుకుని, "ఇక నీవు వెళ్ళవచ్చు. అమావాస్యనాడు సరిగా అర్థరాత్రి సమయాన నేను మీ ఇంటికి వచ్చి నీ అంతరాత్మను తిరిగి నీపరంచేస్తాను !" అన్నాడు.

"అంతదాకా నేను మామూలు పనులన్నీ చేసుకుంటూ ఉండవచ్చునా, స్వామీ ?" అని హిరణ్యగుప్తుడు అడిగాడు.

"ఓ నిరభ్యంతరంగా చేసుకోవచ్చు !" అన్నాడు మాంత్రికుడు.

హిరణ్యగుప్తుడు తనలో తాను ఆశ్చర్యపడుతూ ఇంటికి వెళ్లాడు. తన అంతరాత్మను మాంత్రికుడు తీసుకున్నా కూడా తనలో ఏవిధమైన మార్పువచ్చినట్టు అతనికి తోచలేదు.

అన్నప్రకారం అమావాస్యనాడు సరిగా అర్థరాత్రి మాంత్రికుడు హిరణ్యగుప్తుడి ఇంటికి వచ్చాడు.

హిరణ్యగుప్తుడు బేతాళమాంత్రికుణ్ణి, సగౌరవంగా ఇంట్లోకి ఆహ్వానించి, "స్వామీ, నా అంతరాత్మను తెచ్చారా ? దానికున్న జబ్బంతా పోయిందా ? ఏదీ, ఒకసారి నన్ను చూడనిస్తారా ?" అని అడిగాడు.

"నువు చూడటం ముఖ్యంకాదురా ! దాన్ని సరిఅయినచోట్ల వెయ్యాలి. నీ

దుకాణం తెరిచి, గల్లాపెట్టె చూపించు!" అన్నాడు మాంత్రికుడు.

హిరణ్యగుప్తుడు దుకాణం తెరిచి గల్లా పెట్టె చూపించాడు. మాంత్రికుడు గల్లా పెట్టె కంతలోనుంచి ఏదో పడేశాడు. అది లోపల పడగానే ఖంగుమని శ్రావ్యమైన నాదం వినిపించింది. "దీన్ని ఇందులో నుంచి తీయకు!" అని మాంత్రికుడు హిరణ్యగుప్తుణ్ణి హెచ్చరించాడు.

తన అంతరాత్మ ఎలావుందో చూడాలని హిరణ్యగుప్తుడికి పట్టరాని కోరిక కలిగింది. అందుచేత మాంత్రికుడు వెళ్ళిపోగానే అతను తన గల్లాపెట్టె మూత తెరిచి చూశాడు. అందులో అతనికి తన అంతరాత్మ బంగారం రంగులో వెలుగుతూ, డబ్బులమీద నాట్యం చేస్తూ కనిపించింది. అది ఉండటానికి అతని చిటికెనవేలి కణుపుప్రమాణమే ఉన్నప్పటికీ, దానిని చూసుకుని హిరణ్యగుప్తుడు చాలా మురిశాడు.

ఇది జరిగినప్పటినుంచీ హిరణ్యగుప్తుడి వ్యాపారం చాలా అభివృద్ధి అయింది. అప్పులుచేసే ఖాతాదార్లు అంతమయ్యారు. తన దుకాణంముందు శోష వచ్చి పడిపోయినవారికి కూడా హిరణ్యగుప్తుడు చిల్లిగవ్వ అప్పు పెట్టలేదు. ఇక పూటానాణాలంటూ అతని గల్లాలో పడనేలేదు. పూటా



నాణెం ఖాతాదారు చేతిలో వుండగానే అతడు పసికట్టెయ్య సాగాడు. వెనక డబ్బు మీద ధ్యాసే లేని మనిషికి ఇప్పుడు ఏక్షణాన గల్లాలో ఎంత సొమ్మున్నదీ తెలుసు.

ఈ గల్లాలో సొమ్ము పెరగసాగింది. దానితోబాటు అందులో వున్న అంతరాత్మ కూడా పెరుగుతూ వచ్చింది. కొంతకాలానికి ఆ అంతరాత్మకోసం పెద్ద గల్లాపెట్టె కావలిసి వచ్చింది. మరికొంతకాలానికి ఇనపపెట్టె వెలిసింది. చిట్టచివరకు ఈ అంతరాత్మ కోసం పెద్ద ఖజానాకొట్టు కట్టవలిసి వచ్చింది.

హిరణ్యగుప్తుడి వ్యాపారదక్షత దేశదేశాలకూ పాకింది. అయన కోటీశ్వరుడై పోయాడు. అయనను ఇప్పుడు భార్యా, పిల్లలూ దేవుడికన్న ఎక్కువగా చూస్తున్నారు. కాని హిరణ్యగుప్తుడికి మాత్రం ఏదో మానసిక వ్యాధి పట్టుకున్నట్టయింది. అయన ఇన్నేళ్లుకూడా ప్రతిరోజూ తన అంతరాత్మను చూస్తూనే ఉన్నాడు. ఈ అంతరాత్మ చూస్తుండగానే వికారంగా అయిపోయింది. దాని మొహమంతా ముడతలు పడి పాపిష్టి కళ పడింది. ఖజానా కొట్టులో దాన్ని చూసినప్పుడల్లా హిరణ్యగుప్తుడికి ఏదో అసహ్యమూ, భయమూ కలగ సాగాయి.

చిట్టచివరకు హిరణ్యగుప్తుడు ఎనభై ఏళ్ళ వృద్ధుడై జబ్బుచేసి మంచం పట్టాడు.



ఇంక కొద్దిసేపటికి చచ్చిపోతాడనగా అయనకు నరకం కనబడింది. అయన భయంతో పెద్దపెట్టున కేకలు పెడుతూ, "నా అంతరాత్మ నన్ను పరమ పాపిని చేసింది! అదుగో చూడండి, నాకోసం నరక ద్వారాలు తెరుచుకుంటున్నాయి! నన్ను మాంత్రికుడు నమ్మించి, సర్వనాశనం చేశాడు!" అంటూ ప్రాణాలు విడిచాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, హిరణ్యగుప్తుడు పాపి అయి నరకానికి పోవటానికి కారకులెవరు? లాభం సంపాదించనందుకు అతన్ని తిట్టిపోసిన భార్యా? అతని అంతరాత్మకు చికిత్స చేసిన మాంత్రికుడా? అతనిచేత డబ్బు గడింపజేసిన అతని అంతరాత్మా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల వెయ్యి ముక్కలైపోతుంది!" అన్నాడు.

దీనికి విక్రమార్కుడు, "తప్పు ఈ ఎవరిదీ కాదు. తన భర్త లాభం సంపాదించాలని భార్య కోరటం అస్వాభావికం కాదు. మాంత్రికుడు హిరణ్యగుప్తుడి అంతరాత్మకు చికిత్స చేస్తానన్నాడే గాని, అతనికి పుణ్యలోకాలు చూపుతాననలేదు. అతను చేసిన చికిత్స సరిగానే ఫలించిందికూడా. ఇక అంతరాత్మను ఏ తప్పులూ, ఏ పాపాలూ అంటవు. ఎందుకంటే ప్రతివాడూ తన అంతరాత్మను సరిఅయిన దారిలో ఉంచుకోవాలి; ఆ బాధ్యత మరెవరిదోకాదు, అంతరాత్మ గలవాడిదే. పోతే, హిరణ్యగుప్తుడు పాపి కావటానికి కారకుడు హిరణ్యగుప్తుడే. అతను చేసిన పొరపాటేమిటంటే, తన అంతరాత్మను బుద్ధి పూర్వకంగా ఇతరుడి పరం చెయ్యటం! ఈ పని చేయటం ద్వారా హిరణ్యగుప్తుడు నరకాన్ని కోరి తెచ్చుకున్నాడు!" అన్నాడు.

ఈ విధంగా రాజుకు మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. (కల్పితం)





# న్యాయనిర్ణయం

పూర్వం కాశ్మీరురాజ్యాన్ని సుకేతుడనే రాజు పరిపాలించేవాడు. శ్రీనగరు ఆ రాజ్యానికి రాజధాని. శ్రీనగరుకు దూరాన ఉన్న ఇంకొక నగరంలో ఒక న్యాయాధికారి ఉండేవాడు. న్యాయనిర్ణయం చెయ్యటంలో ఆయన ఎంతో ప్రజ్ఞ కనబరచసాగాడు. కొద్దికాలంలోనే ఆయన ఖ్యాతి కాశ్మీరు రాజ్యమంతటా వ్యాపించింది.

ఈయనను ఎక్కడెక్కడివాళ్లూ మెచ్చుకుంటూ ఉండటం చూసి సుకేతమహారాజుకు ఆశ్చర్యం కలిగింది. ఆ న్యాయాధికారి న్యాయనిర్ణయం చేసి ఇచ్చే తీర్పులు ఎలా వుంటవో స్వయంగా చూడాలని ఆయనకు కోరిక కలిగింది.

వెంటనే ఆయన సామాన్యుడి దుస్తులు ధరించి, తన గుర్రాన్ని ఎక్కి ఆ న్యాయాధికారి ఉండే నగరానికి బయలుదేరాడు. సుకేతమహారాజు రెండు రోజులు ప్రయాణం చేసి తన గమ్యస్థానం చేరాడు. ఆయన నగరద్వారం దాటి నగరంలోకి వెళుతూండగా దారి పక్కన ఉన్న ఒక కుంటి బిచ్చగాడు, "ధర్మప్రభూ!" అంటూ దగ్గిరికి వచ్చాడు.

రాజు వాడి చేతిలో కొంత డబ్బు పెట్టి ముందుకు సాగిపోబోయాడు. కాని బిచ్చగాడు ఆయనను వదలక మళ్ళీ, "ధర్మప్రభూ!" అన్నాడు.

"ధర్మం చేస్తినిగదా? ఇంకేం కావాలి?" అన్నాడు రాజు.

"బాబూ, నగరంలో సంత సాగుతోంది. కుంటివాణ్ణి, అంత దూరం నడిచిపోలేను. గుర్రంమీద, మీ వెనక, ఎక్కించుకోండి. సంతదగ్గిర దిగి నా దారిన పోతాను!" అన్నాడు కుంటి బిచ్చగాడు.

"సరే ఎక్కు," అని రాజు ఆ బిచ్చగాణ్ణి తన వెనక కూచోబెట్టుకుని నగర

ఎన్. పార్వతీబాయి



మధ్యానికి వెళ్ళాడు. అక్కడే సంత జరుగుతున్నది.

"ఇదే సంత. ఇక నువు దిగి వెళ్ళ వచ్చు," అన్నాడు రాజు.

"నువే దిగు ముందు," అన్నాడు బిచ్చగాడు.

వాడు దిగలేక తన సహాయం కోరు తున్నాడనుకుని రాజు గుర్రం దిగి, "నా చెయ్యి పట్టుకుని జాగ్రత్తగా దిగు!" అన్నాడు బిచ్చగాడితో.

"నన్ను దిగమనటానికి నువ్వెవరు? పోనీ పాపమని గుర్రం ఎక్కనిచ్చినందుకా?" అన్నాడు బిచ్చగాడు.

"నా గుర్రంమీద నన్ను నువు ఎక్క నిచ్చేదేమిటి? పిచ్చిమాటలాడక దిగు!" అన్నాడు రాజు.

"ఈ గుర్రం నాది, నేను దిగను!" అన్నాడు బిచ్చగాడు ఖచ్చితంగా.

"ఇంత అన్యాయం నే నెక్కడా చూడ లేదు. ఈ నగరంలో గొప్ప న్యాయాధికారి ఉన్నాడు తెలుసా?" అన్నాడు రాజు.

"ఎంత న్యాయాధికారి అయితేమాత్రం ఈ గుర్రం నాలాటి కాళ్ళు లేనివాడిదని తీర్పు ఇస్తాడుగాని, పిడిరాయిలాగా ఉన్న నీదని ఒక్కనాటికి చెప్పడు!" అన్నాడు బిచ్చగాడు.

"ఏం చెబుతాడో తెలుసుకుందాం, న్యాయస్థానానికి పద!" అన్నాడు రాజు.

"నాకేం భయంలేదు. పోదాం పద!" అన్నాడు బిచ్చగాడు.

న్యాయాధికారి తమ ఇద్దరి మధ్యా ఏవిధంగా న్యాయం చెబుతాడో చూడాలని రాజుకు తీవ్రమైన కోరిక కలిగింది.

రాజూ బిచ్చగాడూ కలిసి న్యాయస్థానానికి వెళ్ళేసరికి అప్పటికే కొన్ని ఫిర్యాదులను గురించి విచారణ జరుగుతున్నది.

ఒక కరణమూ, ఒక రైతూ ఒక స్త్రీని గురించి తగాదాపడి వచ్చారు. ఆ స్త్రీ

మూగది. ఆమె నా భార్య అంటే నా భార్య అని ఆ ఇద్దరు పురుషులూ తగాదాపడుతున్నారు. ఇద్దరూ ప్రమాణాలు చేశారు.

"సరే, ఈ రోజు ఈమెను నాదగ్గిర వదిలి వెళ్లండి. రేపు నేను మీకు తీర్పు చెబుతాను," అన్నాడు న్యాయాధికారి.

తరవాత ఒక కసాయీ, ఒక నూనెగానుగవాడూ వచ్చారు. కసాయి చేతిలో గుప్పెడు చిల్లరడబ్బులున్నాయి. గానుగవాడి చేతుల నిండా నూనె ఉన్నది.

"అయ్యా, ఈ కసాయి నాదగ్గిరికి వచ్చి, ఒక మొహరీకి చిల్లర ఇచ్చేట్టయితే నూనె కొంటానన్నాడు. నేను నాదగ్గిర ఉన్న చిల్లర అంతా తీసి లెక్కపెడుతూండగా, డబ్బులన్నీ లాగేసుకుని తనవే నంటున్నాడు. న్యాయం చిత్తగించాలి!" అన్నాడు నూనె గానుగవాడు.

"అయ్యా, నేను ఈ మనిషిదగ్గిర నూనె కొనటానికి వెళ్లినమాట నిజమే. నా జేబులో ఎంత డబ్బున్నదోనని తీసి లెక్కపెట్టుకుంటూంటే ఈ మనిషి నా చెయ్యిపట్టుకుని ఈ డబ్బులు తనవే నంటున్నాడు. న్యాయం చిత్తగించాలి!" అన్నాడు కసాయి.

"ఆ డబ్బులు నావద్ద ఉంచి, రేపు రండి. తీర్పు చెబుతాను!" అన్నాడు న్యాయాధికారి. తరవాత గుర్రం తగాదా వచ్చింది.





"అయ్యా, మాది శ్రీనగరు. ఇవాళ సంతలో కొన్ని సరుకులు కొందామని నేను నా గుర్రంమీద ఎక్కి ప్రయాణమై వచ్చాను. నగరద్వారం వద్ద ఈ కుంటిమనిషి తగిలి నన్ను ధర్మం అడిగాడు. డబ్బు లిచ్చాను. తరవాత తనను నా గుర్రంమీద ఎక్కించుకుని సంతవద్దకు చేర్చమన్నాడు. అలాగే చేశాను. కాని సంతవద్ద ఈ మనిషి దిగక పోగా, పైపెచ్చు ఈ గుర్రం తనదే నంటున్నాడు!" అని రాజు చెప్పాడు.

"అయ్యా, నేను కాళ్ళులేనివాణ్ణి. అందుచేత ఎక్కడికి వెళ్ళినా ఈ గుర్రంమీదే వెళతాను. సంతకోసమని నేను వస్తుండగా ఈ పెద్దమనిషి ద్వారంవద్ద కనిపించాడు. చాలాదూరం నడిచి డస్సిపోయానని చెప్పి, తనను ఎలాగైనా సంతకు చేర్చమన్నాడు. సరేగదా అని సంతదాకా తెస్తే ఈ గుర్రం తనదేనని నాతో పేచీపడ్డాడు! తమరు న్యాయం నిర్ణయించండి!" అన్నాడు కుంటివాడు.

న్యాయాధికారి ఒక క్షణం ఆలోచించి, "ఈ గుర్రాన్ని నావద్ద ఉంచివెళ్ళి, మళ్ళీ రేపు రండి. తీర్పు చెబుతాను!" అన్నాడు.

మర్నాడు న్యాయస్థానానికి ఫిర్యాదీలూ, ప్రేక్షకులూ వచ్చారు.

న్యాయాధికారి కరణాన్ని పిలిచి, "ఈ స్త్రీ మీ భార్యే. మీ రామెను తీసుకువెళ్ళండి. ఈ రైతు తప్పుడు ఫిర్యాదు చేసినందుకుగాను యాభై కొరడాదెబ్బలు శిక్ష విధిస్తున్నాను" అన్నాడు.

తరవాత ఆరుస రెండవ ఫిర్యాదీ అయిన కసాయిని పిలిచి, "ఈ డబ్బులు నీవే, తీసుకో. తప్పుడు ఫిర్యాదు చేసినందుకు నూనెగానుకవాడికి యాభై కొరడాదెబ్బలు శిక్ష!" అన్నాడు.

తరవాత న్యాయాధికారి రాజునూ, కుంటివాణ్ణీ పిలిచి, "మీరు తగాదాపడే గుర్రాన్ని ఇరవై గుర్రాల మధ్య కట్టేయించాను!





వాటిలో మీ గుర్రాన్ని మీరు పోల్చుకో గలరా?" అని అడిగాడు.

పోల్చుకోగలనని రాజు అన్నాడు. పోల్చుకోగలనని కుంటివాడుకూడా అన్నాడు.

న్యాయాధికారి రాజుతో, "ముందు నువు నావెంట రా!" అని తీసుకుపోయాడు.

ఇరవైగుర్రాల మధ్యఉన్న తన గుర్రాన్ని రాజు సులువుగా గుర్తించాడు. "సరే, నువు న్యాయస్థానానికి వెళ్లి, కుంటివాణ్ణి పంపించు!" అన్నాడు న్యాయాధికారి.

రాజు అలాగే చేశాడు. కుంటివాడు కూడా రాజులాగే గుర్రాన్ని గుర్తించాడు.

న్యాయాధికారి న్యాయస్థానానికి తిరిగి వచ్చి, రాజుతో, "ఆ గుర్రం నీదే. దాన్ని నువు తీసుకుపోవచ్చు. తప్పుడు ఫిర్యాదు చేసినందుకు కుంటివాడికి యాభై కొరడా దెబ్బల శిక్ష విధిస్తున్నాను!" అన్నాడు.

అంతటితో ఆ పూటకు కచేరీ ముగిసింది, అందరూ వెళ్లిపోయారు. రాజు ఒక్కడే ఉండిపోవటం చూసి న్యాయాధికారి, "ఇంకా ఎందుకు ఇక్కడే ఉన్నావు. నేనిచ్చిన తీర్పు నీకు తృప్తికరంగా లేదా?" అని అడిగాడు.

"చాలా తృప్తికరంగా ఉంది. ఆ విషయమే మీతో మాట్లాడాలని ఆగాను. న్యాయం చెప్పటం తేలికకాదు. నా ఫిర్యాదు విషయంలో మీరు న్యాయమే చెప్పారని నాకు తెలుసు. మిగిలిన ఫిర్యాదుల సంగతి నేనేమీ చెప్పలేను. బహుశా వాటిలోకూడా న్యాయంగానే తీర్పుచెప్పి ఉంటారు! కాని మీరు అంత తెలివిగా ఎలా న్యాయ నిర్ణయం చేస్తారో నేను ఊహించలేకుండా ఉన్నాను," అన్నాడు రాజు.

"అది నువ్వనుకున్నంత కష్టంకాదు. ఆ స్త్రీ విషయం తీసుకో. ఆమెను నిన్న రాత్రి మా యింటికి తీసుకుపోయాను. ఇంటికి వెళ్లగానే ఆమెను పిలిచి నా కలందాన్ కడిగి అందులో సిరా పొయ్యమన్నాను.



ఆమె ఆ పని చెయ్యటం అలవాటున్నదాని లాగా ఆ పని చేసేసింది. మామూలు రైతు భార్య అయితే అలా చెయ్యలేదు. అందు చేత ఆమె కరణం భార్యేనని నిర్ణయించాను," అన్నాడు న్యాయాధికారి.

"డబ్బులు కసాయివాడివేనని ఎలా నిర్ణయించారు?" అన్నాడు రాజు.

"అది మరీ తేలిక. నూనెవాడి చేతులూ, అరిచేతులూ నూనె ఓడుతూ ఉండటం నువు గమనించే ఉంటావు. అవి వాడి చేతితో పట్టుకున్న డబ్బులయితే వాటికి నూనె అంటి ఉండాలి. ఆ డబ్బులను నీటిలో వేసి చూశాను. ఒక్కచుక్క నూనె కూడా నీటిమీద తేలలేదు," అన్నాడు న్యాయాధికారి.

"మా తగాదాలో గుర్రం నాదని ఎలా నిర్ణయించారు? కుంటివాడు గుర్రాన్ని గుర్తించలేకపోయాడా?" అని రాజు అడిగాడు.

"గుర్తించాడు. మీరిద్దరూ గుర్రాన్ని గుర్తించగలరని నాకు ముందే తెలుసును!" అన్నాడు న్యాయాధికారి.

రాజు ఆశ్చర్యంతో, "అయితే మరి గుర్రం నాదని మీరు ఎలా నిర్ణయించారు?" అని అడిగాడు.

"నేను గమనించినది మీలో ఎవరు గుర్రాన్ని గుర్తించుతారా అని కాదు; గుర్రం మీలో ఎవరిని గుర్తించుతుందా అని! అది నిన్నే గుర్తించింది! అందుచేత గుర్రం నీదని నిర్ణయించాను!" అన్నాడు న్యాయాధికారి.

ఆ న్యాయాధికారి తెలివితేటలు సుకేత మహారాజుకు అపూర్వంగా కనిపించాయి. ఆయన శ్రీనగరుకు తిరిగివెళ్లాక న్యాయాధికారిని రప్పించి ఆయనకొక జాగీరు బహూకరించాడు. తాను తీర్పు చెప్పినది మహారాజుకేనని తెలిసి న్యాయాధికారి పొందిన ఆశ్చర్యానికి అంతులేదు.






## 2

[చీనాదేశంలో అలాదీన్ అనే పేద కుర్రవాడుండేవాడు. వాడి తండ్రి పోయాడు. తల్లి వాణ్ణి ఎంతో శ్రమపడి పెంచుతున్నది. వాడు అస్తమానమూ వీధులలో తన యీడు కుర్ర వాళ్లతో చేరి ఆడుతూ తల్లికి ఏవిధంగానూ ఉపయోగపడకుండా తిరుగుతూ ఉండేవాడు. ఇంతలో ఆ ఊరికి మొరాకోదేశంనుంచి ఒక మాంత్రికుడు వచ్చాడు. అలాదీన్‌తో వాడికి పని ఉన్నది. అందుచేత అలాదీన్ పినతండ్రినని చెప్పుకుని, అలాదీన్ తల్లి పరిచయం చేసుకున్నాడు. ఈ కొత్తచుట్టం తన కొడుకును ప్రయోజకుడు చేస్తాడని ఆమె నమ్మింది.]

ఆరాత్రి అలాదీన్‌కు ఆనందోద్రేకంతో నిద్ర పట్టనేలేదు. తెల్లవారుతూనే ఎవరో తలుపు తట్టారు. అలాదీన్ తల్లి వెళ్లి తలుపు తీసింది. బయట మాంత్రికుడున్నాడు. అతను, "అలాదీన్ ఏం చేస్తున్నాడు?" అని అడిగాడు. ఈ ప్రశ్న వింటూనే అలాదీన్ ఒక్కపరుగున బయటికి వచ్చి తన "చిన్నాయన"ను వాటేసుకున్నాడు.

తరవాత మాంత్రికుడు అలాదీన్ చెయి పట్టుకుని బజారుకు తీసుకువెళ్ళాడు. ఇద్దరూ ఒక దుస్తుల దుకాణంలోకి వెళ్ళారు. "మావాడికి మంచి ఖరీదైన దుస్తులు కొన్ని చూపండి!" అని మాంత్రికుడు దుకాణదారును అడిగాడు. దుకాణదారు చాలా వెల గల దుస్తులు కొన్ని తీసి చూపాడు. "వీటిలో నీకు ఏది నచ్చితే అది తీసుకో!"

బి. ప్రసాదరావు



అన్నాడు మాంత్రికుడు. అలాదీన్ అన్నిటిలోకీ మంచివిగా ఏరి తీసుకున్నాడు. మాంత్రికుడు వాటి ఖరీదు ఇచ్చేశాడు.

అక్కడినుండి బయలుదేరి ఇద్దరూ స్నానశాలకు వెళ్ళారు. అలాదీన్ స్నానం పూర్తిచేసి కొత్త దుస్తులు వేసుకున్నాడు. ఆ దుస్తులు చూచుకుని వాడు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు; ఎందుచేతనంటే వాడు తన జన్మలో అలాటి దుస్తులు ధరించి ఎరగడు.

తరవాత ఇద్దరూ కలిసి వర్తకుల వీధికి వెళ్ళారు. అక్కడ వర్తకులు క్రయవిక్రయాలు ఏవిధంగా సాగించేదీ అలాదీన్‌కు



మాంత్రికుడు చూపించాడు. "నాయనా, నువుకూడా రేపు వర్తకుడివి కాబోతున్నావు గనక ఈ వీధికి తరుచుగా వస్తూ, ఈ వర్తకులతో పరిచయం సంపాదించాలి!" అని మాంత్రికుడు అలాదీన్‌ను హెచ్చరించాడు.

మధ్యాన్నం అయేదాకా ఇద్దరూ నగరంలో వింతలన్నీ చూశారు, పెద్దపెద్ద భవనాలూ, మశీదులూ సందర్శించారు. తరవాత వారొక భోజనశాలకు వెళ్ళారు. అక్కడ భోజనం పూర్తి కాగానే మాంత్రికుడు అలాదీన్‌ను రాజభవనం చూడటానికి తీసుకువెళ్ళాడు. ఈ భవనం చుట్టూ అందమైన ఉద్యానవనాలున్నాయి.

ఇవి చూడటం అయిపోయాక మాంత్రికుడు అలాదీన్‌ను విదేశీ వర్తకులుండే విడిదికి తీసుకుపోయాడు. ఆ సాయంకాలం ఆయన ఆ విడిదిలో ఉండే విదేశీ వర్తకులనందరినీ విందుకు పిలిచి, భోజన సమయంలో అలాదీన్‌ను వారికి పరిచయం చేస్తూ, "వీడు నా అన్నగారి కుమారుడు!" అని చెప్పాడు.

చీకటి పడే సమయానికి మాంత్రికుడు అలాదీన్‌ను ఇల్లు చేర్చాడు. తన కొడుకు వేసుకున్న కొత్త దుస్తులు చూసి అలాదీన్ తల్లి ఆనందం పట్టలేకపోయింది. "మరిదీ,





నీ రుణం మేమెన్నిటికీ తీర్చుకోలేం!" అన్నదామె.

"ఇందులో రుణమేముంది, వదినా? వాడు నాకుమాత్రం కొడుకుకాడా? వాడికి తండ్రి ఏమి చేసేవాడో అంతకంటె హెచ్చు నేనేమీ చెయ్యటంలేదు. వాడి భవిష్యత్తు గురించి నీకు ఎటువంటి బెంగా వద్దు!" అన్నాడు మాంత్రికుడు.

"నీకడుపు చల్లగా, నూరేళ్లు బతుకు, నాయనా! వాడిభారం నీదే! వాడు నువు చెప్పినట్టల్లా విని నీ పేరు నిలబెడితే అంతే చాలు!" అన్నది అలాదీన్ తల్లి.



"అలాదీన్ ఇప్పుడెంతమాత్రమూ చిన్న పిల్లవాడు కాడు, వాడు పెద్దవాడయాడు. నేను కోరేదల్లా ఏమంటే, వాడు వాడి నాన్న లాగే పరువు మర్యాదలు సంపాదించుకుని, ముసలితనంలో నిన్ను సుఖపెట్టాలని! రేపు శుక్రవారం గనక దుకాణాలు మూసే స్తారు. ఎల్లుండి అలాదీన్‌చేత దుకాణం తెరిపిస్తాను. రేపు ఉదయం వచ్చి వాణ్ణి తీసుకుపోతాను. నగరం వెలపల ఉన్న తోపులు చూసివస్తాం. అక్కడికి గొప్పగొప్ప వాళ్లంతా శలవురోజు వనవిహారాలకూ, వన భోజనాలకూ వస్తారు. మనవాణ్ణి వాళ్లకు పరి చయం చేస్తాను!" అని చెప్పి, మాంత్రికుడు అలాదీన్ తల్లివద్ద సెలవు పుచ్చుకుని తన బసకు వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి అలాదీన్ తన విభష్యత్తును గురించి రకరకాలుగా ఊహించుకుంటూ నిద్రపోయి, మర్నాడుదయం పెందలాడే లేచాడు. మాంత్రికుడు వచ్చి తలుపు తట్టి నప్పుడు వాడే వెళ్ళి తలుపు తెరిచాడు. మాంత్రికుడు వాణ్ణి కౌగలించుకుని, "నాయనా, ఇవాళ నువు నీ జన్మలో ఊహించలేని వింతలు చూడబోతున్నావు!" అన్నాడు ఉత్సాహంగా.

ఇద్దరూ చేతులు పట్టుకుని నడుచు కుంటూ నగరద్వారం దాటివచ్చారు. నగరం

వెలపల విశాలమైన ఉద్యానవనాలూ, మధ్య మధ్య సంపన్నుల భవనాలూ ఉన్నాయి. అలాదీన్ వీటినెప్పుడూ చూసి ఉండలేదు. ఒక్కొక్క భవనాన్నే చూసినప్పుడల్లా వాడు విస్మయం చెందసాగాడు.

నగరం దాటి చాలాదూరం వెళ్ళి వాళ్లు అలిసిపోయారు. విశ్రాంతికోసం వాళ్లు ఒక ఉద్యానవనం ప్రవేశించారు. అక్కడ ఒక అందమైన జలయంత్రమూ, దానిచుట్టూ తళతళలాడే ఇత్తడిసింహాలూ ఉన్నాయి. మాంత్రికుడు తన రొండినుంచి ఒక సంచీ తీసి, అందులోనుంచి పళ్ళూ తినుబండారాలూ అలాదీన్‌కిస్తూ "అకలిగా ఉందేమో, వీటిని తిను, బాబూ!" అన్నాడు. ఫలహారం అయాక ఇద్దరూ మళ్లీ ప్రయాణంసాగించారు.

"మనం ఇంకా ఎంతదూరం వెళ్ళాలి, చిన్నాయనా? తోటలన్నీ దాటి వచ్చేశాం. ముందుకుపోతే ఆ ఎదురుగా కనిపించే కొండ తప్ప ఇంకేమీలేదు. మనం ఇక తిరిగిపోదాం. నడిచి నడిచి నా కాళ్ళు తెగలాగుతున్నాయి" అన్నాడు అలాదీన్.

"మగవాడివి కావుట్రా? అలా దిగజారి పోతావేం? నీ కింకోరకం ఉద్యానవనం చూపించ బోతున్నాను. నువు చూసిన అన్ని ఉద్యానవనాలకన్న కూడా అది అందమైనది. ప్రపంచంలో ఏ మహారాజువద్దా



అటువంటి ఉద్యానవనం ఉండదు!" అన్నాడు మాంత్రికుడు. అలాదీన్‌కు మార్గ శ్రమ తెలియకుండా ఉండేందుకు మాంత్రికుడు చిత్ర విచిత్రమైన కథలు చెప్పాడు. ఇంతలో ఇద్దరూ ఒక చోటికి వచ్చి చేరారు. ఈ చోటు చూడటానికే ఆ మాంత్రికుడు ఘొరాకో దేశంనుంచి చీనాదేశానికి వచ్చాడు.

"మనం చేరవలసిన చోటికి చేరుకున్నాం. కాస్సేపు విశ్రాంతి తీసుకో. ఆ తరవాత నీకు ఎన్నో అద్భుతాలు చూపిస్తాను. అటువంటి అద్భుతాలను మానవ మాత్రుడెవడూ ఎన్నడూ ఊహించి అయినా ఉండడు!" అన్నాడు మాంత్రికుడు.

అలాదీన్ కాస్సేపు విశ్రాంతి తీసుకున్నాక మాంత్రికుడు అతన్ని ఎండు కట్టెలూ, చితుకులూ ఏరుకు రమ్మన్నాడు. వాటితో మంట చేశాక ఎన్నో అద్భుతాలు చూపుతానన్నాడు.

తన "చిన్నాయన" ఏం వింతలు చూపుతాడా అని ఆశ్చర్యపడుతూ అలాదీన్ చుట్టూ ఉన్న పొదలలోకి వెళ్ళి, చితుకులూ ఎండు పుల్లలూ ఏరి, పెద్ద మోపుకట్టి తెచ్చి మాంత్రికుడిముందు పెట్టాడు. మాంత్రికుడు ఆ పుల్లలతో నిప్పుచేసి, అది పెద్ద జ్వాల అయినాక, ఒక డబ్బీలోనుంచి చిటికెడు గుగ్గిలం మంటలో చల్లుతూ, ఏవో మంత్రాలు చదివాడు.







వెంటనే ఆకాశం చీకటి అయిపోయింది. భూమి దద్దరిల్లింది. మరుక్షణం నేల విచ్చుకుని, లోపలగా ఒక చలవరాతి పలక కనిపించింది. ఆ పలకలో ఒక రాగి పలయం అమర్చి ఉన్నది.

ఇదంతా చూసి అలాదీన్‌కు మతి పోయినట్టయింది. వాడు పారిపోవటానికి ప్రయత్నించాడు. కాని మాంత్రికుడు వాణ్ణి పట్టుకుని, వాడి నెత్తిమీద పిడికిలితో బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు అలాదీన్ స్పృహతప్పి పడిపోయాడు. మాంత్రికుడు తన మంత్ర శక్తితో వాడికి స్పృహ తెప్పించవలసి వచ్చింది. అలాదీన్ కళ్లుతెరిచి, "నేనేం తప్పుచేశానని నన్ను కొట్టావు, చిన్నాయనా?" అని అడిగాడు.

మాంత్రికుడు మృదువుగానే జవాబిస్తూ, "నాయనా, నువు కుర్రతనం వదిలించుకుని మగతనం సంపాదించాలనే ఉద్దేశంతో కొట్టాను. నేను నీ తండ్రికి తమ్ముణ్ణి, నీకు చిన్నాయనను. నా మాట వినటం నీ విధి. నేను చెప్పినట్టు చేస్తివా నిన్ను ప్రపంచంలో ఉండే చక్రవర్తులందరికంటెకూడా ధనికుణ్ణి చేస్తాను. కనక నేను చెప్పేది జాగ్రత్తగా విను. నా మంత్రాల మహిమవల్ల భూమి ఎలా విచ్చుకున్నదీ నువు చూశావుగద! ఆ కనపడే రాతిపలక అడుగున ఒక గొప్ప నిధి ఉన్నది. దానిని పైకితీసే శక్తి నీకు మాత్రమే ఉన్నది. ఆ రాతిని నువుమాత్రమే ఎత్తి దానికింద ఉండే మెట్లు దిగి వెళ్లగలవు. సరిగా నేను చెప్పినట్టు చెయ్యి; రాతికింద ఉన్న ధనాన్ని మనమిద్దరమూ పంచుకుందాం!" అన్నాడు.

ఈ మాటలతో అలాదీన్ తనకు తగిలిన దెబ్బకూడా మరిచిపోయి, "ఏం చెయ్యాలో చెప్పు, చిన్నాయనా. నువు చెప్పినట్టే చేస్తాను!" అన్నాడు.

మాంత్రికుడు అలాదీన్‌ను దగ్గిరికి తీసుకుని ముద్దుపెట్టుకుని, "నాయనా, నువు



నాకు కొడుకుకన్న ఎక్కువైనవాడవు. నాకు ప్రపంచంలో నువు తప్ప వేరే బంధువు లేడు. నాకు నువే వారసుడవు. నిన్ను చూద్దామనీ, ధనవంతుణ్ణి చేద్దామనీ ఇంత దూరం వచ్చాను. చూడూ, ఆ రాతిలో ఉండే రాగి వలయాన్ని పట్టుకుని పైకెత్తు, రాయి పైకి వచ్చేస్తుంది!" అన్నాడు.

"అంత రాయిని నేను ఒక్కణ్ణే ఎత్త గలనా, చిన్నాయనా? నాకంత బలంలేదు. నువుకూడా కాస్త సాయంపట్టు," అన్నాడు అలాదీన్.

"ఈ పని నీ ఒక్కడివల్లే కావాలి. నేను చెయ్యి పెట్టానో, మనం పడిన శ్రమ యావత్తూ నిరుపయోగమై పోతుంది. చెప్పాను కానా, ఆ రాతిని ఎత్తగలవాడివి ఈ ప్రపంచంలో నువు ఒక్కడివే! రాయి పైకెత్తేటప్పుడు నీపేరూ, మీ నాన్నపేరూ, మీ అమ్మపేరూ ఉచ్చరించాలి," అన్నాడు మాంత్రికుడు.

అలాదీన్ తనకున్న బలమంతా వినియోగించి, మాంత్రికుడు చెప్పిన ప్రకారమే రాతిని పైకి ఎత్తాడు. అది అతనికి ఎక్కువ బరు వనిపించలేదు. ఆ రాతిని తీయగానే దాని అడుగున పన్నెండు మెట్లూ, వాటి చివర ఒక ద్వారమూ కనిపించాయి.



అప్పుడు మాంత్రికుడు ఇలా చెప్పాడు:

"అలాదీన్, నేను చెప్పేది చాలా శ్రద్ధగా విను. అక్షరాలా నేను చెప్పినట్టే చెయ్యి, నా మాటలు వెంట్రుకవాసికూడా అతిక్రమించవద్దు. ఆ కనిపించే మెట్లు దిగి అడుగున ఉన్న గుహలోకి వెళ్ళు. అందులో పెద్ద చావడి ఉంటుంది. అది నాలుగు భాగాలుగా చేసివుంటుంది. వాటన్నిటిలోనూ వెండి బంగారాలు నింపిన హుండీలుంటాయి. నువు అక్కడ క్షణంకూడా ఆగవద్దు; అక్కడి వస్తువులనుగాని, గోడలనుగాని తాకవద్దు; ఆఖరుకు నీ బట్టలుకూడా దేనికీ తగల కుండా చూసుకో, పొరపాటున దేన్నయినా



తాకావో, మరుక్షణం నల్లరాయిగా మారి పోగలవు, జాగ్రత్త! చావడి చివరను ఒక ద్వారం కనిపిస్తుంది. రాయి ఎత్తేటప్పుడు ఉచ్చరించినట్టే నీపేరూ, మీ నాన్నపేరూ, అమ్మపేరూ వుచ్చరించి తలుపు తెరు. దాని అవతల చక్కని పళ్ళచెట్లు గల తోట కనిపిస్తుంది. ఈ తోటలో యాభై గజాల దూరం వెళ్లాక నీకు ముప్పై మెట్లు కనిపిస్తాయి. వాటిని ఎక్కిపోతే ఒక ఎత్తయిన డాబా కనిపిస్తుంది. ఈ డాబాకు ఎగువగా ఒక దీపం వేలాడగట్టి వుంటుంది. ఆ దీపాన్ని దించు. అందులో వుండే చమురు అవతల పారబొయ్యి. తరవాత దీపాన్ని నీ చొక్కా లోపల దాచు. ఆ దీపంలో వుండేది మామూలు చమురు కాదు, అందుచేత నీ బట్టలు పాడవుతాయని భయపడ నవసరం లేదు. వచ్చేటప్పుడు తోటలో నీకు కావలిసిన పళ్లు కోసుకుని తెచ్చుకో!"

మాంత్రికుడు ఇదంతా చెప్పి, తన వేలి నుండి ఒక ఉంగరం తీసి అలాదీన్ వేలికి తొడుగుతూ, "నాయనా, ఈ ఉంగరం నిన్ను అన్ని ఆపదలనుంచీ రక్షిస్తుంది. నువు మటుకు అక్షరాలా నేను చెప్పినట్టే చెయ్యి. ఏమాత్రమూ భయపడకు, ధైర్యంగా వుండు. కొద్దిసేపట్లో నువు ప్రపంచంలోకెల్లా ధనవంతుడవు కాబోతున్నావు," అన్నాడు.





అలాదీన్ గుంటలోకి దూకి మెట్లు దిగి ద్వారంకుండా గుహలో ప్రవేశించాడు. మాంత్రికుడు చెప్పినట్టే ఒక పెద్ద చావిడి, నాలుగు విభాగాలు చేసివున్నది. ఒక్కొక్క విభాగంలోనూ ఒక్కొక్క హుండీ వున్నది. ప్రతిదానిలోనూ బంగారం వున్నది. అలాదీన్ అక్కడ ఆగక, దేన్నీ తాకక, అతి జాగ్రత్తగా చావిడి దాటి తోటలో ప్రవేశించి, తరవాత మెట్లెక్కి డాబామీదికి వెళ్ళాడు. అక్కడ వేలాడగట్టివున్న లాంతరును దించి, అందులో వున్న చమురు పారబోసి, దీపాన్ని తన చొక్కాలోపల భద్రంగా దాచుకున్నాడు. తరవాత అలాదీన్ తోటలోకి తిరిగివచ్చి అక్కడి చెట్లను మొదటిసారి పరీక్షగా చూశాడు. ఆచెట్లమీద అన్నిరంగుల పళ్లూ వున్నాయి. కాని అలాదీన్‌కు ప్రపంచజ్ఞానం లేకపోవటంచేత అవి నిజంగా పళ్లుకావనీ, నవరత్నాలనీ తెలుసుకో లేకపోయాడు. విలవ కట్టటానికి వీలులేని వజ్ర, వైడూర్య, మరకత, మాణిక్య, గోమేధిక, పుష్యరాగాలు ఆ చెట్లకొమ్మలకు పళ్ళలాగా వేలాడుతున్నాయి. అటువంటి రత్నాలు ప్రపంచంలో ఏ రాజువద్దా లేవు. వాటిని చూసి అలాదీన్ రంగురంగుల గాజుముక్కలనుకున్నాడు. వాటి విలవ తెలియకపోయినా, అవి వెదజల్లే రంగుల కాంతులు చూసి

అలాదీన్‌కు ఎంతో ముచ్చటవేసింది. అందు చేత వాడు వాటిని రెండుచేతులా కోసుకుని తన జేబులన్నీ నింపుకున్నాడు. తాను మోయగలిగినన్ని రత్నాలు తీసుకున్నాక వాడు బయలుదేరి గుహనుంచి బయటికి వచ్చి పన్నెండు మెట్లూ ఎక్కి గుంటలో ఆగాడు. గుంటలోనుంచి పైకి ఎక్కటం వాడికి సాధ్యంకాలేదు, ఎందుచేతనంటే వాడి జేబులనిండా అంతులేని రత్నాలు బరువుగా ఉన్నాయి.

"చిన్నాయనా, పైకి ఎక్కలేకుండా వున్నాను, చెయ్యిపట్టుకుని నన్ను పైకి లాగు!" అని అలాదీన్ కేకపెట్టాడు.

"లాంతరు బరువుగా ఉన్నదేమో, అది ముందు నాకిచ్చెయ్యి," అన్నాడు మాంత్రికుడు ఆదుర్దాగా.

"ఇప్పుడు దాన్ని పైకి తీయటం సాధ్యం కాదు. నన్ను పైకి, లాగేసినాక ఇస్తాను!" అన్నాడు అలాదీన్.

కాని మాంత్రికుడికి కావలిసింది లాంతరు. అది చేతికి రాకపోయేసరికి చిరాకు పడిపోతూ, "ఆ లాంతరు ముందిలా ఇయ్యి!" అని గదమాయించాడు. కాని జేబుల్లోనూ, చొక్కాలోపలా రత్నాలు నింపుకున్న అలాదీన్‌కు లాంతరు పైకి తీయటం సాధ్యంకాలేదు.

ఆ దీపాన్ని అలాదీన్ తనకే ఉంచుకోవాలనుకుంటున్నాడనుకుని మాంత్రికుడు మండిపడ్డాడు. "దుర్మార్గుడా, ఆ లాంతరు నాకివ్వకపోయావు గనక నీగతి ఏమిటో చూసుకో!" అంటూ, చితుకులమంట వద్దకు వెళ్ళి, ఏవో మంత్రాలు చదువుతూ అందులో ఇంత గుగ్గిలం చల్లాడు. మరుక్షణం చలపరాయి దభాల్న యథాస్థానంలో పడిపోయింది. దానిపై భూమి ఎప్పటిలాగే కప్పుకున్నది.

అలాదీన్ రహస్యగుహలో ఒంటరిగా చిక్కుకుపోయాడు. (ఇంకా వుంది)






అలరును పురి మహి-లారోప్య మనగ
కలదా పురము చెంత - ఘనమైన మఱ్ఱి.
ఆకాశ మెత్తున - సటునిటు విరిసి
మ్రాకు పక్షులకెల్ల - మందిర మయ్యె.
దాని కోటరముల - తల దాచుకొనుచు
వేనవేల్ పాములు - విడియు నచ్చోట.
దాని నీడను చేరి - దారినిబోవు
మానిసు లెండఱో - మఱతురు శ్రమను.
అట లఘుపతన క-మ్మను కాకి యొకటి
చిటి కాపురమ్మును - సేయుచునుండు.
కడుపు నింపుకొనంగ - కాకి ఆ నాడు
వడి నేగుచుండ క-న్పడె నొక బోయ.
వల చేతబట్టి ప-క్షుల పాలి యముడు
చలపట్టి వచ్చునా - చాయను జూచి
కాకి చెట్టును జేరి - మ్రాకుపై పక్షి
మూకను జేరి చె-ప్పుచు బోయె నిట్లు:

"రాకాసి బోయ అ-దో కాన వచ్చె
మూక ముప్పే వచ్చె - మ్రాకు దాపునకు.
వల నొకచేత నూ-కల నొకచేత
మెలమెల్ల వాడదో - మిత్తియై వచ్చె.
నూకలకోసమై - పోకుడు మీరు
నూకలు నేలపై - మీకుండ వింక."
ఇంతలో బోయవా-డేతెంచె నటకు
కంతల వల వేసె - కాన రాకుండ.
లోన నూకలు జల్లి - తాసటు చాటు
లోనికి బోయి లో-లో నక్కియుండె.
కాకి మాటను విని - కల పక్షులెల్ల
నూకల ఆశకై - పోకుండ నిలిచె.
అంత చిత్రగ్రీవ-మను పావురమ్ము
అంతటి బలగమ్ము - నటు కొనివచ్చి
నూకల గన్గొని - నోరూరుచుండ
కాకి వద్దనుచున్న-గాని, వాలినది.

విద్వాన్ విశ్వం



తనతోనె పావురాల్ - దడదడ దిగియె
కనుతెప్పపాటున - గలిబిలి యయ్యె.
వలలోన బడిపోయి - విలవిలలాడి
కలరూపు దెలిసి ప-క్షులు దిగుల్ చెందె.
" కష్టాలలోననే - కావలె గుండె
నష్టాలలో భీతి - నందుట తగదు.
కలిసికట్టుగ లేచి - వల నెత్తికొంచు
తొలగిపోదము లెండు - కలగి పోవలదు".
అని పావురాల రా - జనె వానితోడ
చనియె నయ్యవి వల - చక్క నెత్తుకొని.
పడె పావురాలని - పరుగిడె బోయ
గడియలో నవియెల్ల - గగనాని కెగసె.



అయ్యొ నా దురదృష్ట-మని బోయ యేడ్చె.
కుయ్యొ మొఱ్ఱో అని - కొట్టుకొన్నాడు
కనుచూపు దాటి పో-యెను పావురాలు
చనె బోయ దురదృష్ట-మును దిట్టుకొనుచు.
ఏ మగునో చూత - మివి యంచు కాకి
ఆ మంద వెంటనే - అరుగుచు నుండె.
" ఇక భయంపడ పని-యే లేదు మనకు
చకచక ఉత్తరా-నకు చనుడింక.
బోయ పోయెను తన - పురమును బట్టి
ఏ యుపాయము మన - కింక రాబోదు.
కలడు హిరణ్యకుం - డెలుక నానేస్తు
వలనెల్ల కొఱికి అ-వల బారవేయు "
అని పావురాల రా - జన్న వారెల్ల
చనిరి హిరణ్యకు - సద్బిలమ్మునకు.
బిల దుర్గమును జేరి - ఎలుక నిర్భీతి
మెలగుచునుండు శ-త్రులచేత బడక
దుర్గములో నున్న - దొరకు భద్రమ్ము
భర్గుడైనను వాని - బట్టుకో లేడు.
బిలముఖమ్మున నిల్చి - పిలిచె పావురము-
" చెలికాడ వచ్చితి - చెడిపోయి యుంటి "
అను గొంతు విని ఎల్క - అఖిలమ్ము దెలిసి
కనుగొని యిది యెట్లు - కలిగిన దనియె.

చిత్రగ్రీవుడు :

" ఏమందు మిత్రమా - ఎంగిలి యాస





నా మందతో వల-లో మాటు కొంటి
ముందు నా మిత్రుల - ముడి విడిపింపు
అందుపై నా త్రాళ్ళ - నంతమొందింపు"
అను కపోతాధిపు - నా యెల్క అనియె

హిరణ్యకం :

"మునురాజు తర్వాత - అనుచరుల్ గాదె"

చిత్రగ్రీవుడు :

"కాదోయి మిత్రమా - కాదట్లు చెప్ప
నా దాపునకు చేరి-నారు వీరెల్ల
వీరిని రక్షించు - విధి నాకు కలదు
సారెకు తనవారి - సంరక్ష వలయు
తము జూచువారినే - దవిలి ప్రేమింత్రు
తము చూడకున్నచో - తప్పిపోయెదరు.
అదిగాక విశ్వాస - మది గొప్ప గుణము
వదలగా రాదది - సదయుల కెపుడు.
నమ్మినవారిని - నడియేట ముంప
సమ్మతమ్మగు నెట్లు? - చయ్యన వారి
విడిపించి ఆ పైన - విడిపించు నన్ను
తడవు సేసిన వచ్చు - తప్పక బోయ"

హిరణ్యకుడు :

"చక్కగా ప్రభుధర్మ-సరణి జెప్పితివి
చిక్కుల విడిపింతు - శీఘ్రమ్ముగాను.
అని హిరణ్యకమను - నా మూషికమ్ము
తన పంటి బలమెల్ల - కనిపింప జేసి



పుటుకు పుటుక్కన - పులుగుల ఉరులు
తటుకున గొఱికి చిం-తల బాపివేసె.
పావురమ్ములు తమ - బంధనా లూడ
అవల తమచోటి - కరిగె రివ్వునను.
ఎలుక మిత్రుల చిక్కు - లెల్లను తీర్చి
బిలములోపలి కేగె - పెద్ద సంతృప్తి.
అది యంతయును చూచి-నట్టి ఆ కాకి
ఇదికదా మైత్రి యం - చెంతయు మెచ్చి
ఆ యెల్కతో మైత్రి - చేయగా నెంచి
తీయని తలపుల - తెఱగుల బోయి
ఆ హిరణ్యకు బిల - మ్మంతట చేరి
ఓహొూయి యని పిల్చె - నొక సంతసమున.





# తంపులమారికి తగిన శిక్ష

తాబేలుతో పందెంవేసి ఓడిపోయాక కుందేలు ప్రతిష్ఠ అంతా గంగపాలయినట్టయింది. ఈ అపఖ్యాతి ఎలా పోగొట్టుకుంటానా అని కుందేలు చాలా రోజులు దీర్ఘంగా ఆలోచించింది.

ఇదే ఆలోచనతో ఒకనాడు కుందేలు ఒక దుంగమీద కూచుని ఆలోచిస్తూండగా ఒక ఉపాయం తట్టింది.

కుందేలు దుంగమీది నుంచి చివాల్న లేచి నిలబడి, "తస్సదియ్యా! మళ్లీ ఒకసారి నక్కకు బుద్ధిచెప్పి, పోయినకీర్తి అంతాతిరిగి సంపాదిస్తాను!" అని పెద్దగా అరిచింది.

సమీపంలోనే ఉన్న చెట్టుకొమ్మమీది నుంచి చాడీలపిచ్చుకమ్మ చాలాసేపుగా కుందేలును గమనిస్తూ ఈ మాటలు కాస్తా విన్నది. తాబేలుమీద ఓడాక కుందేలు పిచ్చుకమ్మకుకూడా లోకువే అయింది. "నక్క బావతో చెబుతాలే! నక్క బావతో చెబుతాలే!" అని పిచ్చుకమ్మ కొమ్మమీద నాట్యంచేసి, తుర్రున ఎగిరిపోయింది.

కుందేలుకు మతిపోయినట్టయింది. ఏం చెయ్యాలో తోచలేదు. కొంతకాలంపాటు నక్క ఎదటపడటం ప్రమాదమనుకుని కుందేలు నేరుగా అక్కడినుంచి తన ఇంటికి బయలుదేరింది.

కుందేలు ఎంతోదూరం వెళ్లకముందే నక్క ఎదురుగా వస్తూ కనిపించింది. కుందేలు అప్పటికప్పుడే యుక్తిపన్నింది; ఇంకా నక్క అంతదూరాన ఉండగానే, "ఏమిటిది, నక్కబావా? నేను నీకేం ద్రోహంచేశానూ? నన్నూ నావాళ్లనూ నాశనం చేస్తానని అందరితోనూ అంటున్నావుటగా? మన స్నేహం ఎప్పటినుంచీ అయిపోయిందీ?" అని రోషంగా అడిగింది.

నక్కకు చాలా కోపంవచ్చి, "ఇదంతా నీతో అన్నవారెవరు?" అని అడిగింది.

టి. శంభుదాసు



"ఎవరు చెబితే ఏంలే? పిచ్చుకమ్మ అన్నది! నాకు మండిపోయింది, చెప్ప వద్దూ! ఆ కోపంలో నీమీద ఏమేమిటో అనే శాను. ఇంకా నయం, నువ్వక్కడలేవు. ఉంటే చాలా బాధ పడేవాడివన్న మాట!" అన్నది కుందేలు.

"ఆ పిచ్చుకమ్మపని పట్టిస్తానుండు!" అంటూ నక్క ముందుకు సాగిపోయింది. కొంతదూరం వెళ్ళాక దారిపక్కనున్న పొద మీదినుంచి, "నక్కబావా? ఓ నక్క బావా! ఎక్కడికి పోతున్నావు, నక్కబావా?" అని పిచ్చుకమ్మ పిలుపు వినిపించింది. నక్క పిచ్చుకమ్మ మాటలు వినిపించుకో కుండా ముందుకుసాగింది.

"నక్కబావా? ఓ నక్కబావా? ఒక్క మాట వినిపో నక్కబావా!" అన్నది పిచ్చుక మళ్ళీ.

నక్క అప్పటికీ వినిపించుకోక, కొంత దూరం వెళ్లి, నిద్రపోబోతున్నట్టుగా పడు కున్నది. పిచ్చుక ఎదురుగా వాలి, "నీకో రహస్యం చెప్పాలి, నక్కబావా!" అన్నది.

"నీమాట కొంచమైనా వినిపించటం లేదు. దగ్గిరికివచ్చి చెప్పు!" అన్నది నక్క.

పిచ్చుకమ్మ ఎగిరి నక్క తోక మీద వాలింది.

"ఇంకొంచం దగ్గిరికి రా!" అన్నది నక్క. పిచ్చుకమ్మ నక్క నడుముమీదికి దూకి, "అదికాదు నక్కబావా—" అన్నది.

"ఇంకా దగ్గిరికి రావాలి!" అన్నది నక్క.

పిచ్చుకమ్మ నక్క పొట్టమీదికి గెంతి, "చూడు, నక్కబావా!" అన్నది.

"రెండుచెవులూ వినపడవు. నా మూతి మీద వాలి, చెవిలో గట్టిగా చెప్పు!" అన్నది నక్క.

అలాగే పిచ్చుక నక్క మూతిమీద వాలింది. సరిగా ఆ సమయానికే నక్క నోరుతెరిచి, పిచ్చుకను గుటుక్కున మింగి, లేచి తన దారిన తాను వెళ్లిపోయింది.



# దురాశ గల కాకి

గంగానదికి వరదలు వచ్చాయి. ప్రవాహం వెంబడి పెద్ద ఏనుగు కళేబరం కొట్టుకు వస్తున్నది. ఒక కాకి ఆ కళేబరంమీద వాలి, "ఆహా, నాకు భలే వాహనం దొరికింది! ఇందులో అంతులేని ఆహారం ఉంది. ఎన్నాళ్లు తిన్నా తరగదు!" అనుకున్నది.

కాకి తన తిండిలో నిమగ్నమైపోయి పక్కగా పోతున్న చెట్లనూ చేమలనూకూడా గమనించ లేదు. కళేబరం ప్రవాహం వెంబడి కొట్టుకుపోయి చివరకు సముద్రాన్ని చేరుకున్నది.

సముద్రంలో అలలు ఆ కళేబరాన్ని ఎటో తీసుకుపోయాయి. ఎటు చూసినా నేల కనిపించటం లేదు.

ఈలోపుగా కళేబరం తాలూకు అస్థిపంజరం మాత్రమే మిగిలి అది కాస్తా నీటిలో మునిగిపోయింది.

అప్పుడుగాని కాకికి జ్ఞానోదయం కలగలేదు. అది గాలిలోకి లేచి ఎగర సాగింది. ఎంత దూరం ఎగిరినా తీరం రాలేదు. ఆఖరుకు దాని రెక్కలలో సత్తువ అయిపోయింది. కాకి కాస్తా సముద్రంలో పడి చచ్చిపోయింది.






## 4

[ఫాలలోచనుడనే రాక్షసుడి బారినుండి తప్పించుకున్న రూపధరుడూ, అతని అనుచరులూ నౌకాద్వీపాన్ని చేరి, ఆద్వీపాన్ని ఏలే చిత్రాశ్వుడినుంచి గొప్ప సహాయం పొందారు. ఆయన వారికి మారుతాలన్నిటినీ ఒక తిత్తిలో బంధించి ఇచ్చాడు. రూపధరుడి నౌకలు దాదాపు స్వదేశాన్ని చేరాయి. ఆఖరుక్షణంలో రూపధరుడి అనుచరులు తిత్తిని విప్పి మారుతాలను పైకి రానిచ్చారు. వాటి ప్రభావంచేత రూపధరుడి నౌకలు ధృవప్రాంతానికి కొట్టుకుపోయాయి. అక్కడ ఉండే రాక్షసులు రూపధరుడి అనుచరులనూ, నౌకలనూ సర్వనాశనం చేశారు. రూపధరుడున్న నౌకమాత్రమే వారిపాల పడకుండా తప్పించుకున్నది.]

రూపధరుడు తన మిగిలిన అనుచరులతో బయలుదేరాడు. మృత్యువువాత పడకుండా తప్పించుకున్నందుకు అతనికి అనందంతో పాటు, తన మిగిలిన నౌకలూ, వాటిలో వున్న అనుచరులు చాలామంది నాశనమయినందుకు విచారం కూడా కలిగింది.

కొంతకాలానికి రూపధరుడి నౌక ఒక ధివిని చేరింది. ఈ దీవిపై సుకేశిని అనే ఒక దేవత ఉంటున్నది. ఈమె జుట్టు చాలా అందంగా ఉంటుంది. ఈమె సూర్యుడికీ, వరుణరాజు కుమార్తెకూ పుట్టినది. మనుషుల భాష మాట్లాడుతుంది, కాని ఈమె మనుషులకు మంచి చేసే స్వభావం కలది కాదు.

రూపధరుడి కీమె సంగతులేవి తెలియవు. అతను తన నౌకను తీరాన, రేవుగా ఉన్న





చోట కట్టేయించి రెండు పగళ్లూ, రెండు రాత్రులూ తన అనుచరులతో అక్కడే గడిపాడు. ఈ రెండురోజులపాటు గ్రీకులు నిరుత్సాహంలో మునిగిపోయి, నిరాశతో కుంగిపోయారు.

మూడోరోజు తూర్పు తెల్లవారే సమయాన రూపధరుడు తన కత్తీ, ఈటె తీసుకుని, ఒక ఎత్తయిన మిట్ట ఎక్కి చుట్టూ కలయజూశాడు. అతనికి ఎవరూ కనిపించలేదుగాని, దూరాన చెట్లమధ్య నున్న సుకేశిని ఇంటినుంచి పొగ ఆకాశంలోకి లేస్తూ ఉండటం కనబడింది. మొట్టమొదట రూపధరుడు తానే స్వయంగా వెళ్లి, ఆ చెట్లమధ్య ఉన్న ఇంట్లో ఎవరు నివసిస్తున్నారో కనుక్కుందామనుకున్నాడు. కాని, అంతకంటే తాను తన నౌకవద్దకు తిరిగి వెళ్లి, అందరూ భోజనం చేసినాక, తన మనుషులను పంపి ఆరా తెలుసుకోవటం మంచిదని అతనికి తోచింది.

కాని భోజనం చెయ్యటానికికూడా ఆహారం లేదు. ఈ విషయం ఆలోచిస్తూ రూపధరుడు తన నౌకకేసి పోతూండగా, ఏ దేవుడో పంపినట్టుగా ఒక దుప్పి అతని దారికి అడ్డంగా వచ్చింది. దాని కొమ్ములు చాలా నిడుపుగా వున్నాయి. ఎండ బాగా కాస్తూండటంవల్ల, సమీపంలో ఉన్న నదిలో దప్పి తీర్చుకోవటానికి అది పోతున్నది.

రూపధరుడు ఆ దుప్పిని సమీపించి తన ఈటెను బలంగా దాని వెన్నులోకి పొడిచాడు. ఆ దెబ్బతో అది కింద పడి, మూలిగి, ప్రాణాలు వదిలింది. రూపధరుడు కొన్ని లతలను పేని తాడులాగా చేసి, ఆ తాడుతో దుప్పి కాళ్లను బంధించి, తాటిని తన మెడకు తగిలించి, దుప్పిని వీపున మోస్తూ, ముందుకు వంగబడి నడుస్తూ తన నౌకవద్దకు వెళ్లాడు. ఇలా ఎందుకు చేయవలసి వచ్చిందంటే, భుజాన వేసుకుపోవటానికి దుప్పి చాలా భారీ అయినది.



అతను తాను కొట్టిన దుప్పిని పడవ ముందు పడేసి, తన అనుచరులకు ఉత్సాహం కలిగించే కబుర్లు ప్రారంభించాడు: "మిత్రులారా, మనం ఇంతలో చచ్చిపోయేవాళ్లం కాము. మనకోసం యమ లోకం ఇంకా చాలాకాలం కాచుకుని వుంటుంది. ఆహారం వుండగా మనం తిండి మాన నవసరంలేదు. మనం ఆకలికి మాడి చచ్చే ఘడియ ఇంకా రాలేదు!"

ఈ మాటలు వినగానే గ్రీకులకు చైతన్యం వచ్చినట్టయింది. వాళ్లు తమ ముఖాలకు అడ్డం పెట్టుకుని వుండిన బట్టలు తొలగించి, లేచి నిలబడి, రూపధరుడు తెచ్చిన దుప్పికేసి చూశారు. వాళ్లు చేతులు కడుక్కొని దుప్పిని వండటానికి ఉపక్రమించారు. చీకటి పడేవరకూ వారు తింటూ, తాగుతూ గడిపి, ఆ రాత్రికూడా తీరానే పడుకుని నిద్రపోయారు.

మర్నాడు తెల్లవారుతూనే రూపధరుడు తన అనుచరులను సమావేశపరిచి వారితో ఇలా అన్నాడు:

"మిత్రులారా, మనకీ ప్రదేశం కొత్త. తూర్పేదో, పడమర ఏదోకూడా తెలియదు. అలాటప్పుడు మనం ఏం చెయ్యాలి? నా మటుకు నాకేమీ పాలుపోవటంలేదు. కాని



చేతులు కట్టుకు కూచోలేం; ఏదో ఒకటి చెయ్యాలి. నేను ఈ సమీపంలో వున్న మిట్ట ఎక్కి చూశాను. ఇదొక లంక. కను చూపుమేరలో ఎక్కడా మరొక తీరమన్నది నాకు కనిపించలేదు. ఈ లంక చూడబోతే ఇందులో కొండలూ గుట్టలూ అటే లేవు. లంకమధ్య చెట్లతోనూ, పొదలతోనూ కూడిన తోపు ఒకటి కనిపిస్తున్నది. దానిమధ్య ఎవరో వున్నారు. ఎందుచేతనంటే ఆ తోపు నుంచి ఆకాశంలోకి పొగ లేవటం నాకు కనిపించింది!"

ఈ మాటలు వినగానే రూపధరుడి అనుచరుల గుండెలు చల్లబడ్డాయి. ఇలాటి పరి





స్థితిలోనే వారు ఒకసారి ఘాలలోచనుల వాతా, మరొకసారి నరభక్షకులైన రాక్షసుల వాతా పడిఉన్నారు. వారు దుఃఖం ఆపుకో లేక కడపలుగా కన్నీరు కార్చసాగారు.

తరువాత రూపధరుడు తన అనుచరులను రెండు ముఠాలుగా విభజించాడు. ఒక ముఠాకు తాను నాయకుడుగా ఉండి, రెండవ ముఠాకు మాయావి అనే సాహసవంతుణ్ణి నాయకుడుగా పెట్టాడు. తోవులో ఉంటున్నదెవరో చూసి రావటానికి ఏముఠా వెళ్ళాలనేది నిర్ణయించటానికి రూపధరుడూ మాయావి వంతులు వేసుకున్నారు. వంతు మాయావిదయింది. వెంటనే మాయావి తన ఇరవైఇద్దరు మనుషులనూ వెంటబెట్టుకుని గొణుగుతూ, సణుగుతూ బయలుదేరాడు.

కొంతదూరం వెళ్లగా అతనికి ఒక పల్లపు ప్రదేశంలో సుకేశిని ఉండే ఇల్లు కనిపించింది. అది చెక్కుడురాళ్లతో అందంగా కట్టిఉన్నది. దానిచుట్టూ ఖాళీస్తలం ఉన్నది. ఇంటిచుట్టూ తోడేళ్ళూ, సింహాలూ మొదలైన అడివిజంతువులు ఉన్నాయి. ఇవన్నీ నిజంగా జంతువులు కావు, మనుషులే. సుకేశిని మనుషులకు మందులూ, మాకులూ పెట్టి జంతువులుగా మార్చివేసింది. అందుచేత ఆ జంతువులు మాయావి ముఠామీద విరుచుకుపడటానికి మారుగా, కుక్కల్లాగా తోకలాడిస్తూ ఆపేక్షగా వారిదగ్గిరికి వచ్చాయి. కాని వాటి రహస్యం తెలియని గ్రీకులు ఆ మృగాలను చూసి బెదిరిపోయారు.

వారు ఇంటిని సమీపించక తలవాకిలికి వెలపలనే నిలబడి ఆలకించారు. ఇంటిలో మగ్గం నేస్తూ సుకేశిని శ్రావ్యంగా పాడుకుంటూ ఉండటం వారి చెవుల పడింది. వారిలో ఒకడు, "మిత్రులారా, లోపల ఎవరో స్త్రీ మహచక్కగా పాడుతున్నది. అయితే మనిషి కావాలి, లేకపోతే దేవత కావాలి. ఆవిడతో మాట్లాడదాం! సందేహం దేనికి?" అన్నాడు.







వెంటనే అందరూ గొంతులెత్తి లోపల ఉన్న స్త్రీని పిలిచారు. సుకేశిని బయటికి వచ్చి, వచ్చినవారిని చూసి, లోపలికి రమ్మని ఆహ్వానించింది. వారు ఆమెవెంట అమాయికంగా లోపలికి వెళ్ళారు. మాయావి మాత్రం సుకేశినిని చూడగానే ఏదో మోసం పసికట్టాడు. అందుచేత అతను బయటనే ఉండిపోయాడు.

తనవెంట లోపలికి వచ్చిన వారందరికీ సుకేశిని రుచి అయిన ఆహారపదార్థాలూ, పానీయాలూ వడ్డించింది. అయితే ఆ పదార్థాలలో ఆమె ఏవో మందులు కలిపింది. అందుచేత గ్రీకులు ఆ పదార్థాలు తింటూనే ప్రపంచాన్ని మరిచారు. తరవాత ఆమె తన మంత్రదండంతో ఒక్కొక్కరినే తాకింది. వెంటనే వారంతా పందుల రూపాలు ధరించి గోంద్రుపెట్టసాగారు. వారి రూపాలు పూర్తిగా మారిపోయాయి గాని, వారి మనసులు కొంచెంకూడా మారలేదు. సుకేశిని గ్రీకులను పందులమందగా మార్చేసి ఒక పందుల దొడ్డిలోకి తరిమేసింది. వారా బందిఖానాలో ఉండి పందులు తినే ఆహారమే తినసాగారు.

సుకేశిని మాయలో పడక తప్పించుకున్న మాయావిమటుకు ఒంటరిగా నౌక వద్దకు తిరిగివచ్చాడు. చాలాసేపు అతని నోట మాటే రాలేదు. అతని కంటివెంట అశ్రుధారలు కారుతున్నాయి. రూపధరుడు మొదలైనవారు ఎన్నో ప్రశ్నలు వేసినమీదట అతను తెప్పరిల్లి జరిగినది యావత్తూ వారికి తెలియజెప్పాడు.

"మీరు చెప్పిన ప్రకారమే మేము తొప్పకేసి బయలుదేరి వెళ్ళాం. అక్కడ ఒక పల్లపు ప్రదేశంలో చక్కని రాతి ఇల్లు కనిపించింది. లోపల ఎవరో స్త్రీ మగ్గం నేస్తూ మనోహరంగా పాడటం వినిపించింది. మేము ఆమెను పిలిచాం. ఆమె వచ్చి అందరినీ లోపలికి తీసుకుపోయింది. ఏదో మోసం







ఉందని తోచి నేను బయటే ఉండి పోయాను. లోపలికి వెళ్లిన మనవారి జాడ మరిలేదు!"

రూపధరుడీ వార్త వింటూనే చివాలున లేచి తన పెద్దకత్తి—వెండి బుడిపెలు గల కంచుకత్తి—తీసుకుని, విల్లంబులు చేత బట్టి, "ఈ ఇంటికి దారి చూపింతువుగాని, నావెంట బయలుదేరు!" అన్నాడు. మాయావి రూపధరుడి కాళ్లు వాటేసుకుని, "నాయకా, నన్నక్కడికి రమ్మనకండి! మీకు వెయ్యి దణ్ణాలు! నేను అక్కడికి రాను, ఇక్కడేఉంటాను. మీరు తిరిగిరారు. నాకు తెలుసు! మీవెంట వచ్చానంటే నాపనీ అంతే అవుతుంది. నాలుగు కాలాలపాటు మీరూ, నేనూ, మిగిలినవాళ్లమూ బతికివుండాలన్న కోరిక ఏమైనా ఉంటే, ఈ దిక్కుమాలిన చోటు వదలి వెళ్ళిపోదాం, పదండి!" అని ప్రాధేయపడ్డాడు.

"సరే, మాయావీ, నీయిష్టం! నువు పడవ వద్దనే ఉండి తిను, తాగు! నేను మాత్రం వెళతాను, వెళ్ళితీరాలి!" అన్నాడు రూపధరుడు.

అతను పల్లపు ప్రాంతానికి వచ్చి, దిగువగా వున్న సుకేశిని ఇల్లు చూసే సమయాన ఒక యువకుడు అతనికి ఎదురువస్తూ ఆగి, "పాపం, మళ్ళీ ఎక్కడికి బయలుదేరుతున్నావు, నాయనా? ఆ కనిపించే ఇల్లు సుకేశినిది తెలుసా? నీ మనుషులందరూ అక్కడ పందుల రూపంలో నిర్బంధించబడి వున్నారు. నువుకూడా వారిని చేరబోతున్నావా?... అయినా భయంలేదు, నేను చెప్పినట్టు చెయ్యి. నీకొక మూలిక ఇస్తాను. సుకేశిని నీ పానీయంలో మందు కలిపి ఇస్తుంది. ఈ మూలిక ప్రభావంచేత ఆ మందు నీమీద పని చెయ్యదు. తరువాత నిన్ను ఆమె మంత్రదండంతో తాకుతుంది. నువు వెంటనే కత్తిదూసి, చంపబోయే వాడిలాగా ఆమెపైకి ఉరుకు. ఆమె భయ







పడిపోయి, నీకు భార్యగా ఉంటానంటుంది. దీనికి నువు ఒప్పుకోవచ్చు. కాని ముందుగా నువు ఆమెచేత దేవతలమీద ప్రమాణం చేయించి, నీకు ఎట్టి అపకారమూ చేయనని మాట తీసుకో," అంటూ ఆ యువకుడు నేలమీదినుంచి ఒక చిన్న మొక్క పీకి రూపధరుడి కిచ్చాడు. ఆ మొక్కవేరు నల్లగా వున్నది. కాని దాని పువ్వు స్వచ్ఛమైన తెలుపురంగులో ఉన్నది.

యువకుడు వెళ్ళిపోయాక రూపధరుడు దీర్ఘాలోచనలో మునిగిపోయి అడుగులో అడుగు వేసుకుంటూ సుకేశిని ఇల్లు చేరి, గట్టిగా కేక పెట్టాడు. వెంటనే సుకేశిని బయటికి వచ్చి తలుపు తెరిచింది. అతను ఆమెవెంట లోపలికి వెళ్ళాడు. కాని అతని గుండె గుబగుబలాడుతూనే ఉంది.

ఆమె అతన్ని ఒక నగిషీ చేసిన కొయ్యకుర్చీలో కూర్చోబెట్టి, కాళ్లకింద పాదపీట పెట్టింది. తరవాత లోపలికి వెళ్లి, మందు కలిపిన పానీయం తెచ్చి అతని ముందు వుంచింది. రూపధరుడు దానిని తాగేశాడు గాని, మూలికా ప్రభావంవల్ల మందు అతని మీద పని చెయ్యలేదు.

సుకేశిని కీ సంగతి తెలియదు. ఆమె మంత్రదండంతో అతనిని తాకుతూ, "వెళ్లు, పందుల కొట్టంలో ఉండే నీ అనుచరులను చేరు!" అన్నది.

వెంటనే రూపధరుడు కత్తిదూసి ఆమెపైకి లంఘించాడు. ఆమె భయంతో వణికిపోతూ, అతని కాళ్లు పట్టుకుని, "ఎవరు నీవు? ఈ విశాల ప్రపంచంలో ఏ ప్రాంతం నుంచి వస్తున్నావు? మీ నగరం పేరేమిటి? నీ తలిదండ్రు లెవరు? నా మందు నాలుకకు తగిలినాక కూడా మారకుండా ఉండటం మామూలు మనుషుల తరం కాదు. నువు రూపధరుడివై వుండాలి. రూపధరుడు నన్ను చూడవస్తాడని ముందుగానే దేవతలు నాతో అన్నారు. మనిద్దరికీ వైరం



పద్దు. ఆ కత్తి అవతలపెట్టేసి నన్ను పెళ్లాడు. మనిద్దరమూ సఖ్యంగా వుందాం !" అన్నది.

"నా అనుచరులను పందులుగా మార్చేసి కొట్టంలో బంధించిన నీతో నాకు సఖ్యం ఎలా పొసగుతుంది ? నన్నుకూడా పందిగా మార్చాలని ప్రయత్నించి, అది సాగకపోయే సరికి, నా భార్యనవుతా నంటావా ? నాకు మరే అపకారమూ తలపెట్టనని ప్రమాణం చేస్తే నీతో సఖ్యంగా వుండటానికి నేను సమ్మతిస్తాను," అన్నాడు రూపధరుడు.

సుకేశిని ఆ ప్రకారమే ప్రమాణం చేసింది. తరవాత ఆమె పరిచారికలు రూపధరుడికి చక్కగా తలంటి స్నానం చేయించారు. అతనికీ, తమ యజమానురాలికీ భోజనం వడ్డించారు. కాని రూపధరుడు ఆ ఆహారాన్ని ముట్టలేదు.

"ఎందుకు సందేహిస్తున్నావు ? మళ్లీ ఏదైనా మోసం చేస్తాననా ? చెయ్యనని ప్రమాణం చేశాను కానా ?" అన్నది సుకేశిని.

"నా అనుచరులు, పందుల రూపంలో వుండగా ఈ విందు ఎలా అరగించేది ? వారిని మామూలు మనుషులను చేసి నా ఎదటికి తెచ్చినదాకా నా మనస్సుకు శాంతి ఉండదు !" అన్నాడు రూపధరుడు.

సుకేశిని తన మంత్రదండం తీసుకుని వెళ్లి, రూపధరుడి అనుచరులందరినీ యథాప్రకారం మనుషులను చేసి వెంటబెట్టుకు వచ్చింది. రూపధరుణ్ణి చూడగానే వారి ఆనందానికి మేరలేదు. వారిలో చాలామంది సంతోషం పట్టలేక ఏడిచారు.

సుకేశిని రూపధరుణ్ణి సమీపించి, "నేను చెప్పినట్టు చెయ్యి. సముద్రతీరానికి వెళ్లు, నీ పడవను తీరంమీదికి లాగించి, నీ సామానూ తాళ్ళూ ఒక గుహలో భద్రం చేయించు. తరవాత, నీ మిగిలిన అనుచరులనుకూడా వెంటబెట్టుకుని యిక్కడికి రా !" అన్నది. రూపధరుడు సరేనన్నాడు.

(ఇంకా వుంది)





# మాయవర్తకుడు

ఒకప్పుడు కైరోనగరంలో మారుఫ్ అని ఒక యువకుడుండే వాడు. అతను అతి పేదవాడు, న్యాయమైనవాడు. అతను పాత చెప్పులు మరమ్మతు చేసి జీవించేవాడు.

అతనికి ఫాతిమా అనే భార్య ఉండేది. ఆమె పరమ గయ్యాళి. ఆమె ఎప్పుడూ కోపంతో రుసరుసలాడుతూ ఉండేది. దానికి తగ్గట్టు ఆమె నోరుకూడా మహచెడ్డది. ఆమె తన భర్తను సుఖపెట్టలేకపోగా అస్తమానం తిట్టి శాపనార్థాలు పెడుతూ, అతనికి జీవితం పైన రోత పుట్టేటట్టు చేస్తూండేది.

మారుఫ్‌కు పరువుగా బతకాలన్న కోరిక జాస్తిగా ఉండేది. వీధిన పడటమంటే అతనికి చాలాభయం. అందుచేత తాను సంపాదించిన డబ్బులన్నీ తన భార్యకోసమే వినియోగిస్తూ వచ్చేవాడు. కాని ఏనాడైనా కర్మం చాలక అతను డబ్బు తీసుకురాకుండా ఇంటికి వస్తే ఆమె తెల్లవార్లూ శాపనార్థాలు పెట్టి, అతనికి కొంచెమైనా మనశ్శాంతి లేకుండా చేసేది.

ఒకనాడు ఫాతిమా తన భర్తతో, "ఇవాళ సాయంకాలం ఇంటికి వచ్చేటప్పుడు, బాగా ఇంత తేనె వేయించి తీపిరొట్టె పట్టుకురా," అన్నది. "అల్లా అనుగ్రహించి నాలుగు డబ్బులు వచ్చేటట్టు చేస్తే అలాగే తెస్తాను! ప్రస్తుతానికి నాదగ్గిర చిల్లిగవ్వకూడా లేదు," అన్నాడు మారుఫ్.

"అల్లా అనుగ్రహించేదేమిటి? ఈ రాత్రికి నాకు తేనెలో ఓడ్చిన తీపిరొట్టె లేకపోయిందో నీకు మూడిందనుకో!" అన్నది గయ్యాళిది.

తనకు నాలుగు డబ్బులు వచ్చేటట్టు చెయ్యమని అల్లాను ప్రార్థిస్తూ మారుఫ్ తన దుకాణానికి వెళ్ళాడు. కాని, ఎవరో పరీక్ష పెట్టినట్టు, ఆ రోజు అతను ఒక చిన్న రాగి డబ్బుకూడా సంపాదించలేక పోయాడు.

ఎ. నారాయణశర్మ



అఖరుకు తిండి రొట్టె కొనుక్కుని ఇంటికి పోవటానికికూడా అతనివద్ద డబ్బు లేదు.

నిరాశా నిస్పృహలతో కుంగిపోయి అతను ఇంటికి తిరిగి వస్తూండగా దారిలో మిఠాయి దుకాణం తగిలింది. అతను కంట నీరు కారుస్తూ దుకాణం బయట నిలబడి, లోపల ఉన్న రకరకాల తీపిరొట్టెలకేసి చూడ సాగాడు. దుకాణదారు అతన్ని గమనించి, లోపలికి పిలిచి, "ఎందుకు విచారంగా ఉన్నావు?" అని అడిగాడు. మారుఫ్ తన గొడవంతా చెప్పుకున్నాడు.

"ఈమాత్రానికే కొంప మునిగిపోలేదులే. నీ భార్యకు కావలిసిన సరుకు నేనిస్తాను, పట్టుకుని వెళ్ళు. డబ్బు తరవాత ఇద్దువు గాని!" అంటూ దుకాణదారు తీపిరొట్టె ఒకటి తీశాడు. కాని దానిమీద పొయ్యటానికి అతనివద్ద సమయానికి తేనె లేదు. "తేనెకు బదులు చక్కెరపాకం వేస్తాను. రెండూ ఒకటే రుచి. మా దుకాణంలో సరుకు కొనేవారు రెంటినీ ఒకటిగానే భావిస్తారు," అంటూ దుకాణదారు రొట్టెమీద బాగా చక్కెరపాకం పోశాడు.

మారుఫ్ దుకాణదారుకు తన కృతజ్ఞత తెలుపుకుని, ఆ తీపిరొట్టెను ఇంటికి తీసుకు వెళ్ళాడు. అతన్ని చూస్తూనే ఫాతిమా, "రొట్టె తెచ్చావా, లేదా?" అని అడిగింది. ఆమె రొట్టెను చూసి సంతోషించకపోగా గొంతు చించుకుంటూ, "రొట్టెమీద తేనె పోయించుకుని తెమ్మని చెప్పితే చక్కెర పాకం ఎందుకు పోయించావు? నాకు తేడా తెలియదనుకున్నావా?" అని అరిచింది.

"నీకు పుణ్యం వుంటుంది, ఈ సారికి ఇలాగే తినేద్దూ! ఇది కొన్నదికూడా కాదు. దుకాణదారు అరువిచ్చాడు. అతనిదగ్గిర తేనె లేదు. ఏం చెయ్యను?" అన్నాడు భర్త హతాశుడై.

"నాకేమీ అక్కర్లేదు," అంటూ ఆమె ఆ రొట్టెను భర్త ముఖాన గిరవాటువేసింది.

"పో, నాకు తేనెరొట్టె పట్టుకురా!" అంటూ దవడమీద గట్టిగా కొట్టింది. ఆ దెబ్బకు మారుఫ్ పక్క పన్నొకటి విరిగి, నోటివెంట రక్తం కారసాగింది.

ఉన్న ఓర్పు కాస్తా పోయి మారుఫ్ తన భార్య నెత్తిన చిన్న మొట్టికాయ వేశాడు. వెంటనే ఫాతిమా అమ్మశక్తిలాగా అయి పోయి, తన భర్త మెడ గట్టిగా పట్టుకుని గుంజుతూ, "ఎవరత్రోయ్! రండి, రండి! నా మొగుడు నన్ను చంపేస్తున్నాడు!" అని పెడబొబ్బలు పెట్టింది.

ఈ పొలికేకలు విని ఇరుగు పొరుగు వాళ్ళు వచ్చి మారుఫ్‌ను అతని భార్య పట్టునుండి విడిపించారు. జరిగినదంతా విని వాళ్ళు ఆ గయ్యాళితో, "చక్కెర పాకం వేసిన రొట్టెకేం లోపం వచ్చింది? మేమంతా తింటున్నాముకామా? అనవసరంగా ఆ నిర్భాగ్యుణ్ణి ఎందుకు చెండుకు తింటున్నావు?" అన్నారు.

వాళ్లంతా వెళ్ళిపోయాక మారుఫ్ రొట్టె ముక్కలన్నిటినీ ఏరి, కొంచెం రుచి చూడమని తన భార్యను బతిమాలాడు, కాని లాభం లేకపోయింది. కడుపు దహించుకుపోతూండటంచేత చివరకు వాటిని తానే తినసాగాడు.



తెల్లవార్లూ భార్యచేత తిట్లు తిని మారుఫ్ మర్నాడు ఉదయమే లేచి మసీదుకు వెళ్లి, తన కష్టాలు కడతేర్చమని అల్లాను ప్రార్థించి, అక్కడినుంచి సరాసరి తన దుకాణానికి చేరుకున్నాడు.

అతను దుకాణంలో కూర్చున్నాడో లేదో, ఇద్దరు భటులు వచ్చి, "నిన్ను కాజీగారు పట్టుకురమ్మన్నారు, పద," అంటూ అతన్ని లాక్కుపోయారు. న్యాయస్థానంలో కాజీ ఉన్నాడు, అతని కెదురుగా ఫాతిమా తల వంచుకు నిలబడి ఉన్నది. ఆమె చేతికి కట్టూ, ముఖం మీద బాగా రక్తం మరకలు గల ముసుగూ ఉన్నాయి.

కాజీ మారుఫ్‌ను చూస్తూనే, "పాపీ, నీకు అల్లా భయం కొంచెంకూడా లేదా? ఈ ఆడకూతురి చెయ్యి విరగగొడతావా? పన్ను రాలగొడతావా?" అని పెద్దగా గదమాయించాడు.

క్షణంపాటు చెప్పులు కుట్టేవాడికి మతి పోయినట్టయింది. అతను కాజీగారికి వాస్తవం నివేదించుకున్నాడు. కాజీకి అతని మాటలలో నమ్మకం కుదిరింది. ఆయన ఒక పావు దీనారం తీసి అతని కిస్తూ, "ఇది పెట్టి నీ భార్యకు తేనెరొట్టె కొనిపెట్టు! ఇద్దరూ మరెన్నడూ కీచులాడుకోకండి, పదండి!" అన్నాడు.

మారుఫ్ ఆ డబ్బును భార్య చేతుల్లో పెట్టేసి తన దుకాణానికి వెళ్ళాడు. కొద్ది సేపటికల్లా భటులు వచ్చి, "నిన్ను న్యాయస్థానానికి తీసుకు పోయినందుకు మాకు భత్యండబ్బులు ఇయ్యి!" అని అడిగారు. ఏం చెయ్యాలో తోచక అతను తన పనిముట్లన్నీ అమ్మి భత్యాలు ఇచ్చేశాడు.

దుకాణం ఖాళీ అయింది. తనకు పట్టిన దుస్థితినిగురించి ఆలోచిస్తూ అతను విచారసాగరంలో మునిగివుండగా ఇంకొక న్యాయస్థానానికి చెందిన భటులు మరి ఇద్దరు వచ్చి, "కాజీగారు నిన్ను పట్టుకురమ్మన్నారు!" అని చెప్పారు.



అతను వారివెంట వెళ్ళి ఈ న్యాయ స్థానంలో మళ్లీ తన భార్య పూర్వంలాగే తనమీద అక్రమంగా ఫిర్యాదు చేయటం గమనించాడు. అతను ఈ రెండో కాజీకి జరిగినదంతా చెప్పి, "ఒక గంటక్రితం మా తగాదాకు ఒక కాజీగారు తీర్పు ఇవ్వటం అయింది," అన్నాడు. కాజీగారు ఫాతిమాను కోప్పడి, "గంటకింద తీర్పు ఇచ్చిన ఫిర్యాదు మళ్ళీ ఏమని తెచ్చావు?" అన్నాడు.

"హుజూర్, నా మొగుడు నన్ను మళ్ళీ కొట్టాడు!" అన్నది ఫాతిమా.

కాజీ అమెను మందలించి, భటులకు భత్యాలు చెల్లించమని మారుఫ్‌తో చెప్పాడు. దాంతో మారుఫ్ జేబులు ఖాళీ అయాయి. అతను మరింత కుంగిపోయి తన దుకాణానికి తిరిగి వెళ్ళాడు.

మరొక గంటకల్లా కొందరు మిత్రులు అతని దుకాణానికి పరిగెత్తుకుంటూ వచ్చి, "మారుఫ్, కొంప మునిగింది! నీ భార్య సుబేదారు కచేరీలో నీమీద ఫిర్యాదుచేసింది. వెంటనే పరారీఅయిపో!" అని చెప్పారు.

మారుఫ్ వెంటనే లేచి దుకాణం మూసి, సాధ్యమైనంత త్వరలో కైరోనగరం దాటి పారిపోయాడు. అసలే చలికాలం. దానికి తోడు వర్షం అరంభమయింది. వానకు తడుస్తూ, చలికి వణుకుతూ అతను చీకటి





పడినదాకా నడిచి ఒక పాడుబడిన భవనాన్ని చేరుకుని అందులో ఆ రాత్రి తల దాచుకున్నాడు.

తన స్థితి తలుచుకున్నకొద్దీ అతనికి ఏడుపు వచ్చింది. కట్టుకున్న భార్య తనకు ఇల్లూ వాకిలీ లేకుండా చేసింది. భవిష్యత్తు చూడబోతే అయోమయంగా ఉంది. అందుచేత అతను పెద్దపెట్టున ఏడవసాగాడు.

ఇంతలోనే ఎవరో, "ఎందుకు నాయనా, అంత దుఃఖిస్తున్నావు?" అని అడగటం మారుఫ్‌కు వినిపించింది.

మారుఫ్ తల ఎత్తి ఒక వింత ఆకారాన్ని చూసి, "ఎవరు నువు?" అని అడిగాడు.

"నేను నూరేళ్లుగా ఈ పాడుపడిన ఇంటిని ఆశ్రయించి ఉన్న భూతాన్ని, నావల్ల నీకేమైనా సహాయం కావాలంటే చెప్పు. ఇవాళ నువు నా అతిథివి!" అన్నది భూతం.

"బాబూ, నీకు చేతనైతే నన్ను ఈ కైరో నగరానికి వీలయినంత దూరంగా చేర్చు. నా జీవితమంతా ధ్వంసమయింది. కొత్త చోట మళ్లా కొత్త జీవితం ఏర్పరుచుకుంటాను!" అన్నాడు మారుఫ్.

"నా వీపుమీద ఎక్కి కూచో!" అన్నది భూతం. అతను అలాగే చేశాడు.

కన్నుమూసి కన్నుతెరిచేసరికి మారుఫ్ ఒక పర్వత శిఖరంమీద ఉన్నాడు. తూర్పు తెల్లవారుతున్నది. పర్వతానికి దిగువున ఒక బ్రహ్మాండమైన నగరం కానవస్తున్నది.

మారుఫ్ గబాగబా కొండ దిగి ఆ నగరం చేరుకున్నాడు. అక్కడి ప్రజలు అతనికి కొత్తగా కనిపించారు. వారు అతని దుస్తులకేసి వింతగా చూసి, అతని చుట్టూ మూగి, "నీ పేరేమిటి? మీది ఏ దేశం?" అని అడగసాగారు.

"నాపేరు మారుఫ్. మాది కైరోనగరం," అని అతను జవాబిచ్చాడు.

"నువు కైరోనుంచి బయలుదేరి ఎంత కాలమయింది?" అని వారు మళ్లీ అడిగారు.



"నిన్న సాయంకాలం బయలుదేరాను," అన్నాడు మారుఫ్. అందరూ గొల్లున నవ్వారు. ఒక పెద్దమనిషి అతనితో, "నీకే మైనా మతిపోయిందా ఏమిటి ? కైరోనుండి ఈ ఖతాన్ నగరానికి ఒక ఏడాది ప్రయాణం. నువు నిన్న సాయంకాలం బయలుదేరట మేమిటి? అప్పుడే రావటమేమిటి ? చాలు, చాల్లే !" అన్నాడు.

"నేను నడిచి రాలేదు. ఒక భూతం నన్ను తన వీపున ఎక్కించుకుని తెచ్చి ఇక్కడ వదిలింది!" అన్నాడు మారుఫ్.

ఈ మాటకు చుట్టూ మూగిన జనం మరింతగా విరగబడి నవ్వారు. "పిచ్చి వాడు!" అంటూ అందరూ అతనిమీద విరుచుకుపడ్డారు.

సరిగా ఆ సమయానికి అక్కడికి ఒక పెద్దమనిషి దేవుడల్లే వచ్చాడు. ఆయన ఆ నగరంలోని గొప్ప వర్తకులలో ఒకడు. "ఎవరో పరాయిదేశంవాణ్ణి పట్టుకుని ఇలా అల్లరిపెట్టవచ్చునా? మీరంతా ఏం పని చేస్తున్నారు ?" అంటూ ఆయన అక్కడి జనాన్ని మందలిస్తూ, వారి మధ్యగా మారుఫ్ వద్దకు చేరుకున్నాడు. ఆయన అతన్ని తన యింటికి అతిథిగా ఆహ్వానించి ఎంతో గౌర వంగా తీసుకు వెళ్లాడు.



మారుఫ్ స్నానంచేసి, తానిచ్చిన ఖరీదైన దుస్తులు ధరించి, సుష్టుగా భోజనంచేసి కూచున్నాక, వర్తకుడు అతనితో, "అయ్యా మీ దుస్తులు చూస్తే ఈజిప్టునుంచి వచ్చి నట్టు కనిపిస్తున్నారు. అసలు మీదే దేశం ?" అని అడిగాడు.

"చిత్తం, నేను ఈజిప్టు దేశస్తుడినే. కైరో నగరంలోనే నా నివాసం" అన్నాడు మారుఫ్.

"అక్కడ ఏంచేసేవారు ?" అని వర్త కుడు అడిగాడు.

"పాతచెప్పులు మరమ్మతు చేసేవాణ్ణి!" అన్నాడు మారుఫ్.

"కైరోలో మీ ఇల్లెక్కడ?" అని వర్త కుడు మళ్ళీ అడిగాడు.

"ఎర్రసందులో," అని మారుఫ్ వెంటనే జవాబిచ్చాడు.

"ఆ సందులో ఉండేవారెవరైనా తెలుసా ?" అన్నాడు వర్తకుడు. మారుఫ్ కొందరి పేర్లు చెప్పాడు.

"షేక్ అహ్మద్ అనే అత్తరు వ్యాపారి తెలుసా ?" అని అడిగాడు వర్తకుడు.

"నాకు తెలియకపోవట మేమిటి? మావి పక్కపక్క ఇళ్లే!" అన్నాడు మారుఫ్ బిగ్గరగా నవ్వుతూ.

"ఆయన ఎలా ఉన్నారు ?"

"అల్లా దయవల్ల కులాసాగానే ఉన్నారు." అన్నాడు మారుఫ్.

"ఆయన కిప్పుడెంతమంది కుమారులు?"

"ముస్తఫా, మహమ్మద్, అలి అని ఆయనకు ముగ్గురు కుమారులు."

"వా రేమేంపనులు చేసుకుంటున్నారు?"

"పెద్దవాడు ముస్తఫా బడిపంతులు. రెండోవాడు మహమ్మద్ అత్తరు వ్యాపారం లోనే ప్రవేశించి, తండ్రి దుకాణానికి పక్కనే తన దుకాణంకూడా పెట్టాడు. మూడోవాడు అలీ, నేనూ చిన్నప్పుడు కలిసి ఆడుకునే వాళ్లం. మేమిద్దరమూ క్రైస్తవుల ఆలయం లోకి జొరబడి, ప్రార్థనపుస్తకాలు దొంగి



లించి అమ్మి, ఆ డబ్బులతో మిఠాయి కొనుక్కు తినేవాళ్లం. ఒకరోజు క్రైస్తవులు మమ్మల్ని పట్టుకున్నారు. షేక్ అహ్మద్ తన కొడుకును చచ్చేటట్టు కొట్టాడు, వాడు కాస్తా పరారీ అయిపోయాడు. ఈ ఇరవై ఏళ్లుగా వాడి జాడే తెలియలేదు."

మారుఫ్ ఈ సంగతి చెప్పగానే వర్తకుడు లేచివచ్చి అతన్ని కౌగలించుకుని, "మారుఫ్, నేనే ఆ అలీని" అన్నాడు.

తరవాత మారుఫ్ తన కథ యావత్తూ స్నేహితుడికి చెప్పేశాడు. అంతా విని అలీ, "చూడు, తమ్ముడూ! నువు కూటికికూడా లేని చెప్పులు కుట్టేవాడివనీ, భార్య పోరు పడలేక పారిపోయి వచ్చావనీ ఇక్కడి ప్రజలకు తెలిస్తే నిన్ను ఎవరూ ఖాతరు చెయ్యరు. నిన్న కైరోలో బయలుదేరి తెల్లారేసరికల్లా ఇక్కడికి చేరుకున్నావంటే అందరూ నవ్వుతారు. నిజం చెప్పటం నిష్ప్రయోజనమైనప్పుడు యుక్తిగా అబద్ధం చెప్పటం తెలివైన పని. నేనీ ఊరు చేరి ఎన్ని బొంకులు బొంకి పైకి వచ్చానో నువు ఊహించలేవు," అన్నాడు.

"అయితే నన్నేం చెయ్యమంటావు ?" అన్నాడు మారుఫ్.

"నేను చెబుతాను విను. రేపు ఉదయం, నా కంచరగాడిదలలో మంచిదిగా చూసి, దానిమీద వర్తకుల వీధికి రా. నీవెంట మా





యింటి బానిసలలో ఒకణ్ణి వెంట తీసుకురా. అక్కడ నేనూ ఇంకా పెద్ద వర్తకులూ కూచుని ఉంటాం. నేను నిన్ను చూడగానే లేచి నిలబడి ఎంతో గౌరవంగా స్వాగత మిస్తాను. కైరోనగరంలో వర్తకులందరిలోకీ గొప్పవాడివని నిన్ను ఇక్కడి వర్తకులకు పరిచయం చేస్తాను. ఎవరన్నా బిచ్చగాళ్లు వచ్చి చెయి చాస్తే ధారాళంగా దానాలు చెయ్యి, అందుకుగాను నీకు కొంత డబ్బి స్తాను. తరవాత నేను నిన్ను ఫలాని సరుకున్నదా? అని అడుగుతాను; కొల్లలుగా ఉన్నదని సమాధానమియ్యి. ఇదంతా కళ్లారా చూశాక ఇక్కడి వర్తకులు నీతో వర్తకం చెయ్యగోరుతారు. వారి సహాయంతో నువు నిజంగానే పెద్ద వర్తకుడివైపోవచ్చు. నేను అలాగే వర్తకుణ్ణి అయాను," అన్నాడు అలీ.

మర్నాడు అలీ తన స్నేహితుడికి చాలా ఖరీదైన దుస్తులూ, వెయ్యి బంగారు దీనారాలూ ఇచ్చి వర్తకుల బజారుకు వెళ్లిపోయాడు. అయన చెప్పిన ప్రకారమే మారుఫ్ ఒక మంచి కంచరగాడిదమీద ఎక్కి, తన వెనక ఒక బానిసవాణ్ణి నడిపించుకుంటూ వర్తకుల బజారు చేరాడు. అక్కడ అతనికి అలీతోబాటు ఖతాన్‌లోని గొప్పగొప్ప వర్తకులందరూ కనిపించారు.

అతన్ని చూస్తూనే అలీ చివాలున లేచి ఎదురువెళ్లి, అతని కాళ్లు కళ్లకద్దుకుని, అతన్ని కంచరగాడిదెపైనుంచి దింపి తెచ్చి వర్తకుల మధ్య కూచోపెట్టాడు.

మిగిలిన వర్తకులు ఒక్కొక్కరే వచ్చి, రహస్యంగా అలీ చెవిలో, "వీరెవరు?" అని అడిగారు.

"ఈజిప్టులో ఇంతకు మించిన వర్తకుడు లేడు. ఈయన తండ్రి తాతల ఐశ్వర్యాన్ని గురించి చిత్రవిచిత్రమైన కథలు చెబుతారు. దాదాపు ప్రతి మారుమూల దేశంలోనూ ఈయన తాలూకు గిడ్డంగులున్నాయి. ఈయ



నతో పోలిస్తే మనమంతా చిల్లర వ్యాపారులమే," అని అలీ వారికి తెలియజేశాడు.

ఈ మాటలు వింటూనే వర్తకులందరూ మారుఫ్ చుట్టూ మూగి, ఒకరిమీద ఒకరు పోటీపడి అతనిచేత షర్బతులు తాగించి మర్యాదచేశారు. వర్తకుల పెద్ద అతనిపక్క చేరి, "అయ్యా, తమరు పచ్చపట్టు తానులేమైనా తెచ్చారా?" అని అడిగాడు.

"కొల్లలు, కొల్లలు!" అన్నాడు మారుఫ్.

"ఎర్రవో?" అన్నాడు వర్తకుల పెద్ద.

"కొల్లలు, కొల్లలు!" అన్నాడు మారుఫ్.

మిగిలిన వర్తకులు ఏ సరుకుగురించి ప్రశ్నించినా అతను, "కొల్లలు, కొల్లలు!" అని మాత్రమే సమాధానాలిచ్చాడు.

"దయచేసి నమూనాలు చూపిస్తారా?" అని వర్తకులు అడిగారు.

"తప్పక చూపిస్తాను, సరుకు రానివ్వండి. వెయ్యి కంచరగాడిదలతో మా బిడారు కొద్ది రోజులలోనే యీ నగరం వచ్చి చేరుతుంది!" అన్నాడు మారుఫ్.

సంభాషణ ఈ విధంగా సాగుతున్న సమయంలో బిచ్చగాడొకడు వచ్చి వర్తకుల కేసి చెయ్యి చాచాడు. వెంటనే మారుఫ్ తన జేబులోనుంచి గుప్పెడు బంగారు నాణాలు తీసి బిచ్చగాడి చేతుల్లో పెట్టాడు.



ఇది చూసి మిగిలిన వర్తకులంతా దిగ్భ్రమ చెందిపోయారు. "ఈ మనిషి రాజులకన్న ధనికుడులా ఉన్నాడు!" అని వారు తమలో తాము అనుకున్నారు.

మరి కాస్సేపటికి ఒక బిచ్చగత్తె వచ్చి చెయ్యి చాచింది. ఆమెకుకూడా మారుఫ్ గుప్పెడు బంగారం దానం చేశాడు. ఆమె మిగిలిన బిచ్చగాళ్ళకు బంగారం చూపింది. వాళ్ళంతా ఒక మందగా వచ్చారు.

తొణకక బెణకక మారుఫ్ తనదగ్గిర వున్న బంగారమంతా బిచ్చగాళ్ళకు పంచేసి, జేబు ఖాళీ అయాక, "అరే అల్లా! ఈ నగరంలో ఇంతమంది బిచ్చగాళ్లున్నారని



తెలిస్తే, ఇంకా ఎక్కువ బంగారం వెంట తెచ్చుకుని ఉందునే! పాపం, వాళ్లు దేహీ అని అడిగితే ఇవ్వకపోవటం ఎలా?" అన్నాడు.

"అయ్యా, తమ రేమీ విచారించ కండి. తమకు అవసరానికి కావలిస్తే మేము సద్దు తాము!" అన్నాడు వర్తకుల పెద్ద.

మరుక్షణమే మారుఫ్‌చేతికి మరో వెయ్యి దీనారాలు అందాయి. మధ్యాన్నం ప్రార్థనల వేళదాకా అతను వాటితో దానధర్మాలు చేస్తూ, ఇంకా మిగిలినవాటిని మసీదులో ప్రార్థనలు చేసేవారిమీద వెదజల్లేశాడు. ప్రార్థనలు ముగియగానే అతను మరొక వెయ్యి దీనారాలు అప్పు తీసుకుని వాటిని కూడా దానధర్మాలకింద పంచేశాడు. చీకటి పడే లోపుగా అతను వర్తకులవద్ద అయిదు వేల దీనారాలు అప్పుచేసి, అదంతా బీద సాదలకు దానధర్మాలు చేసేశాడు.

తన దానధర్మాలు చూసి విస్తుపోయి ఉన్న వర్తకులతో అతను, "నా బిడారు దిగనివ్వండి. మీ బాకీ బంగారం రూపంలో చెల్లించమంటే చెల్లిస్తాను, సరుకురూపంలో చెల్లించమన్నా చెల్లిస్తాను!" అన్నాడు.

ఆ రాత్రి అలీ వర్తకులకందరికీ విందు చేశాడు. ఆ విందులో మారుఫ్ ప్రధాన వ్యక్తి. అతనికి భోజనాలదగ్గిర ఉన్నతాసనం ఇచ్చారు. ఆ రాత్రల్లా అతను పట్టుతానులు గురించీ, రత్నాలను గురించీ ఏకధాటిగా మాట్లాడాడు. మధ్యమధ్య ఎవరైనా, "మీ బిడారులో ఫలాని సరుకు వస్తోందా?" అని అడిగితే, "కొల్లలు, కొల్లలు!" అన్నాడు.

మర్నాడు మళ్ళీ అతను వర్తకుల బజారుకు వెళ్ళి, వర్తకులవద్ద అప్పుచేసి బిచ్చగాళ్ళకు బంగారం దానంచేశాడు. ఇదే విధంగా ఇరవై రోజులపాటు సాగింది. అప్పటికి అతను అక్కడి వర్తకులకు అరవైవేల దీనారాలు బాకీ పడ్డాడు. అతని బిడారు జాడమాత్రం లేదు.

(వచ్చేసంచికలో ముగింపు)



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 డిసెంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : యింటా బయటా జంటకవులవలె....

రెండవ ఫోటో : అంటుకు తిరగాలోయ్!

పంపినవారు :

కె. బసివిరెడ్డి, C/o వాహిని మిల్స్, మార్టేరు, తణుకు తాలూకా - (పశ్చిమ గోదావరిజిల్లా)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# వార్తలు-విశేషాలు

అంగారక గ్రహంలో ఎట్టి శీతోష్ణపరిస్థితులకైనా తట్టుకోగల దిట్టమైన చెట్టు చేమలున్నవనీ, ఈ గ్రహం పైభాగమందు ఇసుక తుపానులుకూడా ఉండవచ్చుననీ భారతదేశంలో జరిగిన పరిశోధనలవల్ల తేలిందని పౌరవిమానయానశాఖా మంత్రి శ్రీ హుమాయూను కబీర్ వెల్లడించారు. ఇతర దేశాల్లో సమకూర్చబడిన భోగట్టాను బట్టి ఇది రూఢి అయిందట.

*　　　*　　　*　　　*

ఇటీవల కర్నూలు సమీపంలోని పొలాలలో ఒక అపురూపమైన జంతువు పట్టుకోబడింది. దీని పేరు 'పంగోలిన్.' చీమలను తినే ఈ జంతువు మలయాలో విస్తారంగా కనబడుతుంది. సుమారు రెండున్నర అడుగుల పొడవున, శరీరమంతా గట్టిచిప్పలతో, ఇది మొసలిని పోలి ఉంటుంది. దీని బరువు 10 పౌనులకు పైగా ఉంది.

*　　　*　　　*　　　*

ఆంధ్రప్రదేశ్‌లోని దుర్భిక్షప్రాంతాలలో 17 మధ్యరకం ప్రాజెక్టుల నిర్మాణానికిగాను కేంద్ర ప్రభుత్వం 30 లక్షల రూపాయలను మంజూరు చేసింది.

*　　　*　　　*　　　*

పశ్చిమగోదావరిజిల్లా, జంగారెడ్డిగూడెంలో లభ్యమయ్యే గ్రాఫైట్ ఖనిజంతో పెన్సిళ్ళకు ఉపయోగించు సీసపుకడ్డీలను తయారుచేసే విధానం సిరమిక్స్ ఇన్స్‌టిట్యూట్‌లో పరిశోధనలవల్ల కనుగొనబడింది. దీని ఫలితంగా గూడూరులో పెన్సిల్ పరిశ్రమ నిర్వహణకు అవకాశమున్నట్టు ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల, వాణిజ్యశాఖా డైరెక్టరుగారు తెలిపారు.



కొలతలు, తూనికల విషయంలో మెట్రిక్ పద్ధతిని ప్రవేశపెట్టడానికి సెంట్రల్ స్టాటిస్టికల్ ఆర్గనైజేషన్‌చే నియమింపబడిన వర్కింగ్ కమిటీవారు సిఫారసుచేసిన కార్యక్రమాన్ని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఆమోదించింది.

* * * *

ప్రఖ్యాత భారత ఇంద్రజాలికుడు ప్రొఫెసర్ పి. సి. సర్కార్ ఇప్పుడు ఖండాంతరాలలో ప్రదర్శనలిస్తూ, దేశదేశాల పొగడ్తలను అందుకొంటున్నాడు. ప్రస్తుతము న్యూజిలాండ్, ఆస్ట్రేలియా దేశస్థులు ఆయన ప్రదర్శనలు చూసి అభినందిస్తున్నారు.

* * * *

సెప్టెంబరు 5-వ తేదీనాటికి, ఇండియా వైస్ ప్రెసిడెంట్ డాక్టర్ రాధాకృష్ణన్‌గారికి 69 ఏళ్లు నిండాయి. ప్రెసిడెంట్ రాజేంద్రప్రసాద్, ప్రధాని నెహ్రూ, కేంద్ర మంత్రులు, పార్లమెంటు సభ్యులు, రాజ్యసభ సెక్రటేరియట్ సిబ్బంది, ఆయన ఇసకు వెళ్లి అభినందనాలు తెలిపారు.

* * * *

చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంలో, సొమ్ము దాచుకునేవారికి తపాలాశాఖ కొత్త సౌకర్యం కల్పించింది. దీని ఫలితంగా ఇటుపైన జాతీయ సేవింగ్స్ సర్టిఫికేట్లను తమ ఇళ్ళకు వచ్చే పోస్టుమెన్‌ల ద్వారా నగదుగా మార్చుకోవచ్చు. ఇందుకు మునపటిలాగ శ్రమపడవలసి రావడం, కాలవిలంబన జరగటం ఇప్పుడు ఉండదు.

* * * *

త్రిచూర్‌కు సమీపంలో ఉన్న కరుమత్ర అనే గ్రామంలో 15 అడుగుల వ్యాసంగల ఒక పెద్ద గుహ, దానినుంచి రెండు వైపులకు పోతున్న సొరంగాలు బయల్పడ్డాయి. ఈ గుహ, సొరంగాలు టిప్పుసుల్తాన్ కాలంనాటివని తలంచబడుతున్నది.

* * * *

మచిలీపట్టణం రేవు అభివృద్ధికి, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 420 వేల రూపాయలు కేటాయించబడినట్టు కమ్యూనికేషన్‌ల శాఖ మంత్రి లోక్‌సభలో చెప్పారు.



# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలకు మొక్కలకు నీళ్లుపోసే పని తగిలింది. వాళ్లిద్దరూ రబ్బర్‌గొట్టాం తీసుకుని నీళ్లు పోస్తూండగా, గోలీకాయలు తీసుకుని వాళ్ళ స్నేహితుడు వచ్చాడు. దాసూ, వాసూలు తాముచేస్తున్న పనివదిలి, గోలీకాయలు ఆడేందుకు వెళ్లారు. 'టైగర్' యిదంతా చూసింది. అది మెల్లగా రబ్బర్ గొట్టాంను నోటపట్టుకుని వెళ్ళి, నీటిని గోలీకాయలు ఆడుతున్న దాసూ, వాసూల మీదకు వదిలింది. వాళ్ళు కట్టుకున్న బట్టలు బాగా తడిసిపోయాయి. పాపం, 'టైగర్'కు నీళ్ళు ఎక్కడవదలాలో తెలీదు; అనుకున్నారు వాళ్లు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'



ఇదుగో! నీ
అశోకా

# ఆరోగ్యమునందు ప్రీతిగలవారు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

పిల్లలు మురికిగా నగుట చాల సహజము, అయితే మురికిగా నుండిపోవుట వారికి చెరుపు. ఎందుచేతననగా, మురికిలో వ్యాధికారక క్రిములున్నవి. వాటి వల్ల అరోగ్యమునకు ఎడతెగని ప్రమాదమున్నది.

లైఫ్‌బాయ్ సబ్బు మురికిలోని క్రిములను కడిగివేసి
మీ ఆరోగ్యమును కాపాడును. ప్రతిరోజూ
లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయుడు.




L. 267-50 TL

# మీబిడ్డ యీవిధంగా వుంటే






## మేనర్స్ గ్రైప్ మిక్శ్చర్ యిచ్చి

## దానికి బదులుగా వచ్చే చిరునవ్వు చూచి ఆనందించండి



ప్రతిరోజూ ఉదయం 10–30 గంటలకు 19 మీటర్లపై, "దునియారంగ్ రంగీలీ" ఒక గంట ఫిల్మ్ సంగీతం కొరకు "రేడియో సిలోన్" ట్యూన్ చేయండి.

మంచి రకాలలో శ్రేష్టమైన యీ చిహ్నం చూడండి.



ఇది మేనర్స్ ఉత్పత్తి

GEOFFREY MANNERS & CO. PRIVATE LTD., BOMBAY · CALCUTTA · DELHI · MADRAS·
ASP/GM3



మాతృమూర్తికి మంచి స్నేహితుడు
ఓ! మళ్లీ జలుబు! పాపం పాప!
అచ్ అచ్ అచ్ అచ్
మోకాలు నొప్పి చేసింది ఇవాళ్ల ఆఫీసుకు వెళ్లినట్లే!!
అమ్మా! నావేలు బెణికింది! మ్యాచ్ ఇవాళ్ల ఎలా ఆడటం?
డాక్టరు వద్ద
...కాదు! తలనొప్పికి మాత్రమే కాదు లిటిల్స్ ఓరియంటల్ బామ్ బెణుకులకు కాళ్ల నొప్పులకు, ఇతర కండరాల నొప్పులకు వాడవచ్చు జలుబు దగ్గులకు ప్రత్యేకించి మంచిది!!
కొంతసేపు అయినాక
అంత త్వరలో అంతా చక్కబడింది ఓరియంటల్ బామ్‌కు ధన్యవాదాలు
అవును నాకు అన్నం పెట్టు. ఆఫీసుకు పోతా!
ఇవ్వాళ్ల మ్యాచ్‌లో గెలవాలని దీవించు బాబా!
ఏకుటుంబం లిటిల్స్ ఓరియంటల్ బామ్ లేకుండా వుండరాదు.
ORIENTAL BALM
లిటిల్స్
ఓరియంటల్ బామ్
జలుబు, నొప్పులకు





అక్టోబరు విడుదల!
బి.యల్.ఎ.సెట్టి కానుక
విఠల్ ప్రొడక్షన్సు వారి
వద్దంటే పెళ్లి
నిర్మాత, దర్శకులు
శ్రీ.బి.విఠల.ఆచార్య
మాటలు, పాటలు
క్రిష్ణమూర్తి. రామ్‌చంద్
క్రిష్ణా పిక్చర్సు రిలీజ్
ART & PUBLICITY



Photo by D. I. Chanthamian



బహుమతి
పొందిన వ్యాఖ్య

అంటుకు తిరగాలోయ్!

పంపినవారు:
కె. బసివిరెడ్డి, మార్టేరు.

